Sree Krishnadeva Raya Pamphlet Series. 1.

# EKABHASHALIPI PRASAMSA.

BY

V. APPARAO.

with an Introduction in English

BY

SARADACHARAN MITTER ESQ. M. A., B. L.,

Ex-Judge of the High Court of

CALCUTTA.

"A common language and a common script are among the factors in nation-building"

Hon. Mr. Krishnaswami Iyer. C. I. E

Copy-Right Registered.

---

MADRAS.

1912.

శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల ౧

# ఏకభాషాలిపి ప్రశంస.



ఇది

వెన్నెలకంటి అప్పారాయ ప్రణీతము.



పూర్వము కలకత్తా హైకోర్టు న్యాయమూర్తిగా నుండిన
శ్రీయుత బాబు శారదాచరణమిత్ర గారి
యుపోద్ఘాత సహితము.



మదరాసు

1912



కాపిరైట్ రిజస్టర్డు.]

[వెల నాలుగు అణాలు.

# అవతారిక.



ఆర్యావర్తంబుననే కాక ప్రతిదేశము నందును బండితులు పెక్కు-లుందురు. అట్టిపండితులలోఁ గొందఱు దేశసేవఁ జేయుటయుఁ గలదు. అట్టివారిసేవ యత్యుత్తమమైనది. కొన్నిసమయములందు నల్పజ్ఞులకుఁ గూడ దేశసేవాభిలాష గలుగవచ్చు. వారి యభిలాష సఫలముకావచ్చు; వారు పండితులకంటెఁ బెక్కు-మడుంగు లధికముగ దేశసేవఁ జేయవచ్చు. దీనికి నుదాహరణంబులు పెక్కు-లు ప్రపంచచారిత్రమునందుఁ గానవచ్చు. అందుచేతనే యల్పజ్ఞుఁడనయ్యు, దేశసేవయే ప్రధానముగా నెంచి, యీ యుద్యమము కడుయసాధ్యంబయ్యు బహుభాషా పండితులకే సాధ్యంబైనదయ్యు నేఁ బూనితి. ఇయ్యదియ ప్రథమ ప్రయత్నంబగు కతంబునను మఱికొన్ని యనివార్య కారణంబుల వలనను ఇందులోపంబులు బెక్కు-లు గానవచ్చు. కాని వాదులాడుట కంటెను వృథాయుపన్యాసంబులిచ్చుటకంటెను నాచరణలోనికిం గొనివచ్చుటకసాధ్యంబగు నట్టియంశంబులఁ బత్రికలఁ బ్రచురించుట కంటెను క్రియాసాధనమే ప్రధానోద్దేశముగాఁ గలిగి శ్రీయుత శారదాచరణమిత్ర మొదలగు మహనీయులు త్రోవనే

నడచుట యత్నించినందున నాప్రయత్నములు విఫలము కావని నమ్మెద. ఇదియునుం గాక లోపంబులు కలవాఁడే కదా మనుష్యమాత్రుండనంబరఁగు. అటులే లోపంబులు కలయదియే కార్యంబనంబరఁగు. కనుక సహజమగు గుణంబునకు మనుష్యమాత్రుని కెడుదూఱుట సహజమని సంభావింపఁదగదు. బిన్నాభిప్రాయంబుల వలననే యేవిషయమునందును నభివృద్ధిఁ గాంచుట సాధ్యము. కనుక మిత్రభావంబున దీనిందిలకించి దేశోపకారంబగు సవరణల నవలోకంబులఁ జేయఁజదువరులు ప్రార్థితులు.

స్వవిషయమై యిఁక గొంచెము నుడువవలసియున్నది. ప్రయత్నము చిన్నదయ్యు సాహాయ్యము పెద్దది లేనిచోఁ గొనసాగనేరదు. ఈపెద్దసాయము నొసఁగునట్టి మహాపురుషులు శ్రీపరమహంస శ్రీరామకృష్ణులు "నీవు జ్ఞానార్థుఁడవైనచో జ్ఞానోపదేశకుల నీవారయవలసినపని లేదు; వారే నీకొఱకు నారయుచు వచ్చెద"రని నుడివినటులఁ గార్యమును జేయువారున్నచో సాయము చేయువారును నీప్రక్కనే యున్నారను దృఢవిశ్వాసము నాకుఁ ధారాళమయ్యె. ఈవ్యాసమును వ్రాసి యేమి చేయుదునని యాలోచించుచుండ నొకనాఁ డాకస్మికముగ విజ్ఞానచంద్రికామండలికి మూలాధారులైనట్టియు మఱియుఁ బెక్కు మహాకార్యంబులొనర్చుచు నాంధ్రమాతను బోషించునట్టి శ్రీశ్రీ మునగాలరాజాగ్రారికిఁ గృతపరిచయుఁడ నగునట్టి యదృష్టము నాకుఁ

గలిగె. అప్పుడే యెవ్వరు హిందీమహారాష్ట్రాది భాషాపండితు
లో యెవ్వరినామము నేఁటికాలమున నాంధ్ర గృహములందు
మనరాయల నామమునకంటె నధికముగ నుచ్చరింపఁబడుచున్న
దో, యేరాంధ్రము నాంగ్లేయ భాషాసమానముగఁ జేయఁగం
కణము కట్టుకొనిరో, యెవ్వరు తమకు సాధ్యమైనంతవఱకుఁ బ్రతి
హైందీయ మహావిషయములో నేకీభవించి సాయము చేయఁ
బూనిరో, యెవ్వరు పైమునగాల రాజాగారికి మిత్రరత్నంబును
దివానులరో, యట్టి మ-రా-రా-శ్రీ కె-వి- లక్ష్మణరావు ఎం-ఏ
గారు హైదరాబాదకు రాజాగారి యొద్దకు వచ్చుట నాయదృ
ష్టవశంబునఁ దటస్థించెను. భయసంశయములతో నిండినవాఁడ
నయ్యు రోటిలోఁదలఁదూర్చి రోకటిపోటునకు వెఱవనేలయని
తలంచి నే నీవ్యాసమును ప్రభుప్రధానులముందఱ నిడితి. ఇందలి
యంశము వివాదాంశమయ్యు మొదట దీని యుపయోగమును
గుఱించి సందేహించిన వారయ్యు, నెందో మూల్గుచుండ వలసిన
నీవ్యాస మీరూపము గైకొనుటకును నాంధ్రుల హస్తంబుల
నుండు భాగ్యము దీనికబ్బుటకును వీరు కారకులని మాత్రమిందు
వందనా పూర్వకముగను జెప్పువాఁడ. దీనులచేఁ గూడఁ బనిచే
యించునట్టి సత్పురుషు లిట్టివారలే కదా? ఇట్టి వారలుండుటం
బట్టియే కదా యాంధ్రులు సంతతోత్సాహులై యున్న వారని
యప్పుడు తలంచితిని. పూర్వపరిచయములేని వాఁడనయ్యు

బాల్య స్నేహితుని కంటె నధికముగ నన్నాదరించి గంటలకొలఁది నాతో ముచ్చటించినట్టి యమాత్యపుంగవుని యొక్కయు నెప్పుడు పోయినను దమ భ్రాతలవలెఁ జూచునట్టి రాజసింహము యొక్కయు గుణగణంబుల వర్ణింపనాతరమె? వీరు నాకుఁ జేసినట్టి యుపకారమను ఋణమును సాధ్యమైనవిధమున భాషాసేవ నొనర్చి తీర్చుకొనువాఁడనే కాని మఱియొక విధమునఁ దీర్చుకొనుట కశక్తుఁడ.

నాకింతసాయ మొనర్చిన నృపేంద్రామాత్యరత్నంబుల కాయురారోగ్యైశ్వర్యములొనఁగూడు గాతమని నాయనవరత ప్రార్థన.

మొదటి యిద్దఱెటుల నన్నాదరించిరో యటులే నా యుత్తరములకు సదుత్తరముల నొసంగి నావ్యాససారాంశమును సత్యాధిక శ్రమతో గ్రహించి యీవ్యాసలేకరి యెవ్వరో కనుగొనకయే యుపోద్ఘాత మొకటి నాంగ్లేయ భాషయందు వ్రాసి నాకు మహోపకారం బొనరించిన శ్రీశారదాచరణమిత్రగారికి నాసాష్టాంగ వందనము లర్పించుచున్నవాఁడ.

ఎవ్వారు వీరపురుష నామధేయమునకు నర్హులో యెవ్వరు నేఁటి కాలమున మనకుఁబూజార్హులో యెవ్వరినామము మనముస్మరించుటచేతనే యాంధ్రమాత ముక్తికినర్హురాలు కాఁగలదో

యట్టి శ్రీకృష్ణదేవరాయల జ్ఞాపకార్థమై హైదరాబాదయందు స్థాపింపఁబడిన భాషానిలయమున 1911 సం॥ ఫిబ్రవరి శనివారము నాఁడు జయప్రదముగ జరుపఁబడిన వార్షికోత్సవదివసమున నీవ్యాసపఠనం బొనర్పించి వారిజ్ఞాపకార్థమై ప్రచురింపఁబడఁ బోవుగ్రంథమాలలో దీనిని మొదటిదిగ గ్రహించినందుకు శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయము వారికిని, దీనిం జెన్నపురి యందు ముద్రణంబొనర్పించిన మ-రా-రా శ్రీ డాక్టరు ఆచంట లక్ష్మీపతి బి- యె- ఎం- బి- సి- ఎం- గారికిని నావందనము లర్పించువాఁడ.

ఇటుల విన్నవించు

భాషాసేవక విధేయుఁడు

వెన్నెలకంటి- అప్పారావు-

కానలి

1-2-12

# INTRODUCTION.

One of the greatest draw-backs to the social, Literary,and even political unification of India is the absence of a common script for dialects and languages now current in it and a common language of literature suitable to the genius of the people. India has now more than a dozen scripts used in its different parts ; Bengal has Bengali, Orissa Uria, Southern India has Telugu, Tamil, Canarese and Malayalam, Western India has Maharathi and Guzarathi, Northern India and Central India the Devanagari, Kaithi, Gurumukhi and Urdu beside *Mahajanis.* The diversity is a great puzzle to linguists and the gratest obstacle to inter-communication. Except the Urdu which uses the Persian character all the other scripts are similar to the Devanagari and although they may not have been derived from the Devanagari and although the Asoka script might be the original type *but* they are so distinguishable from each other that for all ordinary purposes they may be said to be different. Time and space have immensely separated them. The dialects and languages which use these various scripts are not so different from each other as the scripts themselves.

It is now universally admitted that a common script and a common literary language are essential

factors to the formation of a nation out of peoples apparently disunited. The most powerful bonds of union are alphabet, script and language. Modern Europe has shown that religion is not so important a factor as language. Bengal has snccessfully asserted nationality on the basis of the Bengali language. So it is with the Hindi speaking people and Behar has successfully claimed separation. The true unity, however, of India, especially of its Hindu population which is substantially two-thirds of the entire unit, must rest on a uniform alphabet with uniform symbols of elementary sounds and a language of literature which all educated people through-out the length and breadth of India must be able to read and write in. Sanskrit filled ancient India the desideratum of a common language. There was one script for it whatever it was. Modern India, however, has not learned the use of these essentials of unity. We are now politically united and a foreign language difficult to learn and still more difficult to use is our vehicle of inter-communication. But an exotic and unsuitable vehicle may, like the Latin in Europe, be used temporarily by a few. The English or more appropriately the Roman script has admittedly serious defects and it cannot long be used for intercommunication. India must have its own script based on the best phonetic rules and the science of utterance of sounds. In Devanagari it had such an alphabet and a series of characters. Modern India with its

diverse and distinguishable sounds in its different parts may require new symbols, but substantially a script of Indian origin which the great grammarian Maharshi Panini says "Maha devadadhigatini" should be adopted with additions and perhaps with necessary modifications.

The people, however, must be awakened and the necessity of a common script must be impressed on them. They must be shown the light before they can emerge from darkness. The vehicle of English is not sufficient for the general public. The promoters of Ekalipi must address the people in their own dialects or languages. A few English knowing gentlemen are like a drop in the vast ocean.

Mr. Appa Rao has touched the true chord. He has adopted the Telugu for the large population speaking that language. He has done immense services to the cause of the diffusion of the idea of the necessity of a uniform script. He has handled the subject with a master's hand and deserves the thanks of the public. The Hon'ble Mr. Krishnaswami Iyer was a devoted advocate of a common script for India. The Maharaja Gaekwar of Baroda has fully felt its necessity for the social and literary unification of India. Others including myself have persistently made humble efforts in its cause, but the booklet of Mr. Appa Rao will do more good than many speeches in English.

Spontaneous development of ideas and natural growth must have genesis in the people themselves. The ideas are always in, although in a dormant state. They have to be touched by the magic wand to be awakened and progress is natural. The mass of the people must clamour for a common script throughout India.

*85, Grey Street,*
CALCUTTA,
5—1—12.

(Sd.) Saradacharan Mitter.

శ్రీరస్తు.

# ఏకభాషా లిపిప్రశంస.

---

ఈదినములలో హిందూస్థానమందలి యేయాంగ్లేయమాసపత్రికఁ జూచినను, విపులముగనో లేక యల్పముగనో, ఏకభాషాలిపుల ప్రశంస గాన్పించుచున్నది. ఇయ్యది యింత ప్రాముఖ్యమునకు వచ్చుటకు నాంగ్లేయరాజ్యమును నాంగ్లేయభాషయును గాలమహిమయును గారణములు కనుక, ఈత్రివర్గమునకు నేఁ ద్రికరణశుద్ధిగ వందన మాచరించి కార్యాంశమునకు వచ్చెదను.

పూర్వకాలమునం దెన్నఁడో, అనఁగాఁ గాళిదాను భవభూతి ప్రముఖులు తమనాటకముల వ్రాసి ప్రదర్శింపించిన కాలముననో లేక తత్పూర్వమో సంస్కృతము సర్వజనగ్రాహ్యమనియు, లేక, ఇప్పు డాంగ్లేయభాష యుండు స్థితిలో నుండియుండవలెననియు, లేనిచో నీసంస్కృతనాటకంబు లెవ్వారికొఱకు రచింపఁబడినవనియుఁ గొందఱు పండితులు తలంచుచున్నారు. సర్వజనగ్రాహ్యమైనను, కాకపోయినను, ఇప్పు డాంగ్లేయకవిరత్నంబైన షేక్స్పియరు కవికృతనాటకము లెటుల, పరభాషయందు రచింపఁబడినవైనను, హైందవ పండితులవలననే కాక విద్యార్థులచేఁ గూడ నెటుల సులభముగ గ్రహింపఁబడుచున్నవో, అటులే యక్కాలంబునఁ గూడ పండితజనులకొఱకే యవి రచింపఁబడినవని నేఁ దలంచెద. ఏలయన, ఎట్టిసిద్ధాంతమునకు నిదర్శనములు కనఁబడుటలేదో యట్టి సిద్ధాంతమును మనము గ్రహించుట తప్పు. సంస్కృతము వేదకాలమున మాటలాడఁబడుచుండి వెనువెంటనే ప్రాకృతముగా మాఱినటులఁ గాన్పించును. సర్వజనులు ప్రాకృతమును మాటలాడుచుండి రనియు, నందుఁ బండితులు మాత్రము స్వచ్ఛమైన సంస్కృతమును మాటలాడుచుండిరనియు, సంస్కృతమునకును బ్రాకృతమునకును,

సాధారణ బ్రాహ్మణశూద్రాదులు మాటలాడు నాంధ్రమువలె నించుక భేదము కలిగియుండి యుండుననియుఁ గొందఱు నుడువవచ్చు. అప్పటికిని దక్షిణమునఁ బ్రాకృతముకాని సంస్కృతముకాని మాటలాడుచుండిరనుటకు నిదర్శనము లేమాత్రమును గానరావు. కనుక సంస్కృతము స్వచ్ఛమైన రూపమున నుత్తరహిందూస్థానమునఁ గొంతకాలము వాడఁబడినను, హిందుస్థానము నందంతయు వాడఁబడక యుండవలెనని మనమొప్పక తప్పదు. ఉత్తర హిందూస్థానమందలి భాషలే స్వచ్ఛమైన ప్రాకృతభాషలుకాని ద్రవిడభాషలు ప్రాకృతములు కానేరవు.

సంస్కృతవ్యాపకము పెక్కువిధముల, యూరపుఖండమందలి లాటిను భాషతో సరిపోల్పవచ్చును. రెండును నార్యభాషలేకాక, జన్మమునందును, అభివృద్ధియందును, వినాశమునందును సమానలక్షణములు గలిగియున్నవి. రెండును నామతంబున, ఇటలీ హిందుస్థానమునందలి యొక్కొకభాగము నందే మొదట వాడఁబడుచుండి తరువాత పలుభాగంబులకు విస్తరిల్లె; రెండును మతసంబంధ విషయములకు నెక్కువగ నుపయోగింపఁబడియె; రెండును పరభాషలకు మాతృకలయ్యె; ఆయాభాషల స్తన్యపానమిచ్చి కాపాడె. రెండును మాటలాడు వాడుకలో లేకపోయినను గ్రంథరచనయందుఁ బూర్ణదశయందుండినవి. రెండును మతసంబంధవిషయములకు నిప్పుడుకూడ నుపయోగింపఁబడుచున్నవి. ఇన్నిసమానలక్షణంబులఁ గల్గియు, కొన్ని భేదములు కూడఁ గల్గియున్నవి. లాటినుభాష పూర్ణమృత్యుదశను బొంది యొకరిచేతను మాటలాడఁబడుటలేదు. సంస్కృతమన్ననో, హిందూస్థానమందలి యనేక పండితులచేత మాటలాడఁ బడునదియేకాక, కొన్నికుటుంబములందు మాతృభాషగాఁ గూడఁ బరిగణింపఁబడుచున్నది. నాస్నేహితులలో నొకరిచేతఁ గుటుంబసహితముగ నీభాష, ఎన్నుకొనఁబడియె. ఇదియునుంగాక, యూరపునందు లాటినుభాషాభ్యాసము తగ్గుచుండఁగా, హిందుస్థానంబున సంస్కృత

విద్య హెచ్చుచున్నది. ఎంత హెచ్చిన నిది పండిత విద్యయే కాని పామరవిద్య కానేరదు. దీని సమానాసమానములు చూపించుట 'లాటిను' భాష, 'లాటియం' అనఁబడు, 'ఇటాలియా' యొక్క యొకభాగమందు మాత్రముపయోగింపఁ బడుచుండి యెటుల జగద్విఖ్యాతమయ్యెనో, అటులే సంస్కృతము కూడఁ గొంతవఱకు నొకభాగమందు నొక తెగవారిచేత మాత్రమే వాడఁబడుచుండెనని చూపుటకొఱకే.

సంస్కృతము తరువాత హిందూస్థానమందంతయు నేకభాషగాఁ జేయఁబడిన ప్రయత్నములలో 'హిందూస్థానీ' భాష ప్రాముఖ్యము వహించినది. అందునకుఁ గారణము మహమ్మదీయులు పలుతావులఁ దమరాజ్యముల స్థాపించి తమభాషయైన హిందూస్థానీభాషను వెంటఁగొని వచ్చుటయే. ఆంగ్లేయ విద్యాస్థాపనాప్రారంభమునందెంతయో చర్చ, అరబ్బిపారసీకభాషల సదరు న్యాయస్థానముల నుంచవలసినదా లేక యాంగ్లేయభాష నుపక్రమింపవలసినదా యనుటనుగురించి, జరిగి, అంత్యతీర్మానము, ఆంగ్లేయభాష పక్షమున నిచ్చిరి. అపుడే హిందూస్థానమందలి ముఖ్య విశ్వవిద్యాలయములు కూడ స్థాపింపఁబడినవి. కొన్నిరోజుల క్రిందట, హైదరాబాద యందలి (కీర్తిశేషులైన) నిషీకాంతచతోపాధ్యాయగారు హిందూస్థానీ కవితాబీజాంకురములు మొదట దక్షిణమునందనఁగా బీజాపూరు గోలకొండలయందే యుద్భవిల్లినవని నుడివిరి. ఇదియంతయు వ్రాయుట సంస్కృతమునకుఁ దరువాత, ఏకభాషావ్యాపకము, కారణము లెవ్వియైనను, మహమ్మదీయులచేతఁ జేయఁబడినదని చూపుట కొఱకే.

మొదట సంస్కృతభాష, ఏల యేకభాషగాఁ బరిణమింపక నశించె? ఔరంగజేబు చక్రవర్తులం బోలిన మహాపురుషుల సహాయముం బొందియు హిందూస్థానిభాష యేల యభివృద్ధిఁ జెందదయ్యె ననుసంగతి మనము ముందుగ విచారింపవలెను. అధికసంధులు మొదలగునవి కలిగి సాధారణ జనుల యుచ్చా

రణ కసాధ్యంబగు కతంబున సంస్కృతము ప్రాకృతరూపముగ మాఱి యుండవచ్చు. ఇఁక హిందూస్థానీ యన్ననో, అదియుఁ బ్రాకృతమైన కారణంబును, గొంచెమైనను సంబంధములేని ద్రావిడముతో సాంగత్యము కష్టమయినందునను, హిందూస్థానమందంతయు వ్యాపింపకయుండవచ్చు. అదియుఁగాక, ఈహిందూస్థానీభాష పుట్టిన కొలఁదిరోజులకే, భాష రెండుగా విభజింపఁబడియె. హిందూస్థానమందుద్భవిల్లిన యక్కరములు తురుష్కుల 'కొరాను'లోనుండు నరబ్బి యుచ్చారణంబుల స్వచ్ఛముగా నుచ్చరించుటకు వీలుకానందున, వారు పారసీక అరబ్బీ యక్షరంబుల నిందు దిగుమతిచేసిరి. ఎట్టిదుష్కాలమం దవి యిందుఁ గొనిరాబడినవో కాని, ఈయక్కరములు మనకుఁ జేయునపకారము మఱెవ్వరును జేయఁ జాలరు. ఏలయన, ఈయక్కరముల రాకతో నరబ్బిపారసీక పదములెన్నియో కొనిరాఁబడినవి. అన్యదేశీయపదములరాక హెచ్చగు కొలఁది, హిందువులు తమభాషాస్వేచ్ఛకు వికల్పము కలుగునని తలంచి కాఁబోలు సంస్కృతపదములఁ గుప్పలుగఁ దమభాషయందుఁ జొన్పఁబూనిరి. మతసంబంధ మత్సరముల కేకారణములైనఁ జాలుఁగద! ఈవిధముగ నన్యమతస్థులైన హిందూమహమ్మదీయులు, ఏకభాషను విడఁదీసి తామెంతవఱకు కీడము నేయఁగలరో యంతవఱకుఁ జేసి దేశమునకు మహోపకారము నొనర్చిరి. స్వానుకూలముకొఱకే మహమ్మదీయులైనను, తమభాషను వృద్ధిపఱచిరేకాని కలలోనైన దేశమునం దంతయు నేకభాషగాఁ జేయవలెనని తలంచిన వారుకారు. అట్లు తలంచిన, ఏకభాషను విడఁదీయక తగిన మార్పులనే చేసికొని యుందురు. ఈకారణములచేత హిందూస్థానీభాష ఏకభాషగాఁ బరిణమింపక పోయె.

దీనితరువాత మూఁడవప్రయత్నము, ఏకభాషావ్యాపకమునకై యాంగ్లేయులవలనఁ జేయఁబడియె. వీరుకూడ హైందవులనందఱి నేకజాతీయులుగఁ జేయ నెంచికాదు, ఆంగ్లేయభాషను హిందూస్థానమునందంతట వ్యాపింపఁ జేసి

నది. దీనివలన హిందూస్థానమునందలి పలుభాషామతంబుల వారికి నైకమత్యము వలన జాతీయభావము గల్గునని స్వప్నమందైన నెంచరైరి. హిందూస్థానపాలనయందలి వ్రాతపనికొఱకుఁ దమకు సులభముగ నుండుటకుఁ గాను వీరిని వారి భాషయందు తర్బీయతుచేసిరి. కాని ఈయాంగ్లేయభాష కాశీరామేశ్వరము వఱకుఁ గల నవనాగరికులచే మాటలాడఁబడుచున్నను, పాలకభాషయయ్యు, ప్రపంచవ్యాప్తిఁ జెందియున్నను, ఏల యేకభాషగాఁ బరిణమింపదయ్యె? అన్నివిధముల నేకభాషకుఁ దగినదైనను, దీనఁ గొన్నిలోపంబులు గలవు. భాషయందలి తలంపులు భాషను మాటలాడు జనులకు గ్రాహ్యమై యుండవలెను; మఱియు వారిస్వభావానుకూలములై యుండవలెను. అటులఁగాక యాంగ్లేయుల సంఘమతాచారములు భిన్నములై, హిందువుల మతాచారములకు విరుద్ధములై, హైందవుల స్వభావప్రతికూలములై యున్నందున, నాంగ్లేయభాష హిందూస్థానంబున వ్యాప్తినొందుట కవకాశములేదు. ఇక్కారణంబునను, భాషయొక్క యభ్యాసము దుష్కరమైనందునను, ఆంగ్లేయ భాషా వ్యాప్తియగు కొలఁది రాజనీతివిషయములు పెక్కులు దేశమునందు వ్యాపించుటవలనను, తత్పరిహారార్థమై దీని వ్యాప్తికి నాటంకములు గల్పించి పరీక్షల నసాధ్యము చేయుటం బట్టియు, నేర్చుకొనుటకు వ్యయపఱచిన ద్రవ్యమునకు సరియైన వడ్డికూడ రానికారణంబునను, ఈభాషయొక్క స్వల్ప వ్యాప్తికి నాటంకములు గలిగెను. ఈ పైయాటంకములు లేక పోయినను, ఈ భాష సర్వత్ర వ్యాపించు ననుటకు సూచనలేమియుఁ గనఁబడుట లేదు. ఒకవేళ హిందూస్థానమందలి భాషలు శైశవదశయందుండిన యౌవనమునకు వచ్చిన యాంగ్లేయభాష వీనిని జయింపఁగలిగి యుండునేమో! భౌతిక శాస్త్రాదులలో గ్రంథసంచయములేకపోయినను, కళాకౌశలమునందు సమానవైభవమునకు వచ్చిన హైందవజాతీయ భాషలు, ఆంగ్లేయభాష నెదుర్కొనినవి యేకాక ప్రాయశఃజయమును గొనునట్లు గాన్పించుచున్నవి. ఈయన్యదేశభాష

నుద్యోగమును గోరువారే యభిలషించి సేకరించిరి కాని యితరులెవ్వరును గోరరైరి. పట్టణములలోఁ గొంతవఱకును నందులో బ్రాహ్మణుల నధికముగను నీభాష వశముచేసికొనఁ గలిగె; కాని గ్రామములకు విచ్చేయదయ్యె; వ్యాపారులచెంతకు రాదాయె; వాలికావళులకుం దూరమాయె; హీనజాతులకుఁ గాన్పింపనే కాన్పింపదయ్యె. ఇఁక వ్యాపించు టెట్లు? సర్వజనమాన్యమగు టెట్లు? తురుష్కులవలె నాంగ్లేయులు హిందువుల మధ్య నివసించి వారి భాషావ్యాపకము చేయుదురన్న నందుకును సూచనలు గాని సందర్భములు కాని కనఁబడుటలేదు.

ఇప్పు డేకభాషా వ్యాపకమునకు బలకారణ సూచనములేవి కలవు? దీనికి నుత్తరసూచన ప్రథమముననే చూపింపఁబడియె. కాని యది చాలమిచే నధికముగ వ్రాయవలసివచ్చె. హైందవు లింతవఱకును జెందియున్న నిద్రనుండి మేల్కాని, ఆంగ్లేయప్రభుత్వముచే నైక్యముచేయఁబడిన హిందూదేశమును, ప్రభుత్వబంధనముతోఁగూడ తదితర బంధనలచే నైక్యముఁ జేయనెంచిరి. హిందూస్థానమందలి జనులు, సంఘాదిసంబంధములచేతనే, ఏకజాతీయ పదవికి నొప్పియుండిరి. అతివిస్తీర్ణమైన కారణమున, ఆంగ్లేయపాలనకుఁ బూర్వము, హిందూస్థానమంతయు సరియైన ఏకరాజ్యపాలనలోనికిఁ దీసికొని రాఁబడకపోయినను, నేటికాలమునకు,నాంగ్లేయపాలనాప్రభావంబుననేకరాజ్యముగఁజేయఁబడియె. ఈ యేకరాజ్యమును నిలుపుటకుఁ బ్రతి హైందవుఁడును, వాఁడేజాతివాఁడైనను బ్రయత్నించుచుండును. ఈ యేకరాజ్యప్రతిష్ఠాపనప్రతిష్ఠ యాంగ్లేయులకుఁ జెందినను, దానిని భరించుశక్తి హైందవులదై యున్నది. హైందవులలో వాఁడెవ్వఁడైనను, హిందుస్థానమును విడిచినయెడల మఱియొండు దేశము వానిదగునా? వాని కేదేశమందైనను, ఇందుఁగల హక్కులును, ఇందుఁ గలబంధుమిత్రాదులును దొరకఁగలుగుదురా? ఈయొక్క సంగతి యాలోచించిన యెడల హిందుస్థానపు ప్రతి మహమ్మదీయునకును, క్రైస్తవునకును దేశభక్తి

బీజాంకురములుద్భవిల్లు. కనుకనే, దేశమందలి ప్రతిమతమువారును, ప్రతిభాష మాటలాడువారును, తమశక్త్యానుసారముగ నీదేశైక్యమునకుఁ బాటుపడుచున్నారు. దేశైక్యసంబంధ మగువిషయములలో నొకముఖ్య మైన యంశమే యీ భాషాలిపి ప్రశంస.

ఏకభాషాలిపియొక్క వ్యాపకమునకుఁ దగినప్రయత్నములు సూచించుటకు ముందు, ఏకభాషావ్యాపకము సాధ్యమా యసాధ్యమా యనునది శాస్త్రోక్తముగా విచారించెదము.

ప్రపంచమునందలి భాషలలో నేభాష లెట్టి సందర్భములలో నే భాషల నిర్మూలింపఁగలవనుటనుగురించి విచారించునపుడు మనము ముఖ్యముగ 'నరబ్బి' ముఖ్యభాషగాఁ గల 'సెమిటిక్' శాఖయును, ఆర్యభాషాశాఖయొక్క యుపశాఖలైన యూరోపియను భాషల నెత్తికొని విచారించెదము. భాషల నాకసమునందలి మేఘములతో దాదాపు సరిపోల్పవచ్చు. అవి యిప్పు డొకమూల నుత్పత్తిఁ గొని క్షణమాత్రములో నాశనమగుటయో లేక పర్వతాకారముఁ గాని లేక వివిధరూపముల నెటులఁగొను చున్నవో, అటులే భాషలుకూడ నవి నాగరికస్థితియం దున్నను, ననాగరిక స్థితియందున్నను, జన్మించి వ్యాపించి వృద్ధిఁబొంది నశించుచుండును. అందుఁ గొన్నిమాత్రము శాశ్వతముగఁ బ్రపంచమునందు నిలిచిపోవును. ఇవివఱకెటు లున్నను, బ్రస్తుత కాలమున ఐరోపియనుభాషలు పూర్ణస్థితియందు న్నవి; సెమిటిక్ భాషలనాగరికస్థితియందున్నవి. కాని రెంటియందును నొకవిధమైన మార్పులనే మనము గనుఁగొన వచ్చును. సెమిటిక్ భాషలయందలి మార్పులు, అవి పూర్ణస్థితియందుండక పోవుటం బట్టియు, వానిని మాటలాడు జనులు కూడ ననాగరికులగుటవలనను, ఐరోపియను భాషాపరీక్షులకు, నరబ్బి యాప్రాంత్యముల సదుపాయములు లేనికారణమునను, మనకుఁ జక్కగాఁ దెలియుట లేదు. కాని తెలిసినంతవఱకు నచ్చట నెన్నియో యుపశాఖలు కలవ

నియు, నంచుఁ బూర్ణస్థితికివచ్చిన యరబ్బిభాష, వానిని బాఱఁదోలి, తన నిరంకుశాధికారమును స్థాపించుచున్నదనియు స్పష్టముగఁ గనఁబడుచున్నది. ఈభాగమందు నివసించు తురుష్కులకు జాతీయాభిమానము బొత్తిగాలేని కారణముననను, మతసంబంధ పుస్తకములన్నియు నరబ్బిభాషయందుండుటవలనను, మతాభిమానులగు నీతురుష్కులకు నరబ్బీభాషయందు గణ్యతయుండుట వలనను, వీరందఱు నీయరబ్బి వ్యాపకమునకుఁ దోడ్పడుచున్నవారేకాని యేమాత్రమును నె దుర్పాటు చేయుచున్నటులఁ గనఁబడదు.

ఇఁక మమ్ముల మాటలాడు వారెటులఁ దమ పౌరుషాదులఁ జూపించుచు నొకరిని మించ నొకరు ప్రపంచమునందంతయు వ్యాపించుచున్నారో, ప్రపంచమునందు భౌతికమహిమను జక్కగా గ్రహించని కారణంబున, కూపస్థమండూకంబులం బోలిన భూగోళవాసులారా! చూడుఁడు. రైలు టెలిగ్రాముల గాలియోడల మోటరుబండ్లను గనిపెట్టిన యైరోపియనుల ప్రభావమును చూడుఁడనునట్టియు, అట్టి జగద్విఖ్యాతుల ప్రఖ్యాతి మేము లేకుండినచో నెటులఁ బ్రపంచమందంతయు వ్యాపించు ననునట్టియు, నైరోపియను భాషల ప్రభావమును, వానియైకమత్యవైరమును నించుక విచారించుదము. హిందూస్థానమునకంటెఁ గొంచెము పెద్దదగు యూరపుఖండమునందు, 'లాటిను' 'గ్రీకు' 'పురాతనస్లవానిక్కు' 'హీబ్రూ' భాషలుకాక యఱువదిస్పష్టమగు భాషలనుపయోగించుచున్నారని యైరోపియను చరిత్రకారులే యొప్పికొనియున్నారు. అందునొకవిఖ్యాతలేఖరి భాషలనుగుఱించిచర్చించు తఱి "(1) ఇంగ్లీషు (2) ఫ్రెంచి (3) జర్మన్ (4) రషియన్ (5) ఇటాలియన్ (6) స్పానిషుభాషలు యూరపుఖండమందు నాయకత్వమునకుఁ బోరాడుననియు, (7) డచ్చి (8) స్కాండనేవియను భాషలు తమస్థానమును గాపాడుకొనఁగలవేకాని వ్యాపకమునకుఁ దగినసూచనలఁ గనఁబఱచుట లేదనియు (9)బొహీమియన్ (10) హంగేరియన్ భాషలు తమస్థానముల బలపఱచుకొనిన

వనియు (11) నవీనహెల్లినిక్ భాష, అనుకూల సందర్భములలోఁ దన సనాతనాన్యత్వమునకు రాఁగలదనియు'' వ్రాయుచున్నాఁడు. ఈ పైభాషలలో నేఁటికాలమునఁ గూడ నొకభాష మఱియొకభాషను బరాభవించుచున్నది. ఫ్రెంచిభాష ఫ్రాంసుదేశమందు మాటలాడఁబడునదియే కాక, స్విట్జర్లాండులోఁ గొంతభాగములోను, బెలిజయములో నెక్కువ భాగములోను మాటలాడఁబడుచున్నది. ఉత్తరమునను, దక్షిణమునను చిన్నిశాఖలఁ దరిమి వేయుచున్నది. జర్మనీప్రభుత్వము క్రిందనుండు ఆల్‌సేస్‌లోరేన్‌లోఁ గూడ వ్యాపించియున్నది. మఱియు నింగ్లీషుభాషకంటె నధికముగఁ గూడఁ బరభాషావలంబకులచే నీభాష చదువఁబడుచున్నది. ఇట్టి యాధిక్యము భాషావిశేషంబుచేతనే కదా! కొంతకాలము క్రిందట జర్మనీభాషావరణమైన 'ఇటాలియా' సరిహద్దుననున్న పట్టణములు నేఁడు ఇటాలియాభాషా మయములైనవి. ఆస్ట్రోహంగేరిదేశములో హంగేరియన్ బోహిమియన్ భాషలఁ బునరుద్ధారణచే జర్మనీభాషావ్యాపకమునకుఁ గొంత భంగము కలిగె. కొన్నిశతాబ్దముల క్రిందటఁ బ్రసిద్ధికెక్కి స్వేచ్ఛ ననుభవించుచుండిన పోలాండనునది యూరపునందొండు కలదు. కాలవశంబున నది తనస్వేచ్ఛాధికారమును గోల్పోయినదియే కాక రషియా ఆస్ట్రియా జర్మనీదేశంబుల మధ్య విభజింపఁబడియె. ఇపుడు రషియా పూర్ణాధికార చక్రవర్తి పోలిషు భాషఁ బాఠశాలలోఁ గఱపఁబడకుండుటయే కాక, పాఠశాలల యావరణములలో నాభాష మాటలాడకుండునటులఁ గూడ శాసించి, యీపూర్ణయౌవనమునకు వచ్చినట్టియు, సంపూర్ణజాతీయాభిమానమును గల్గినట్టియు, నది గోల్పోయినందున ఖేదించుజనులచే-మాటలాడఁబడునట్టియు భాషను, నిండుప్రాణిని గ్రొంతుకపిసికి చంపునటులఁ దుద ముట్టించుననం దగు. కాని, ఈ పోలాండుదేశస్థులును, వీరినిఁ బెక్కువిధములఁ బోలి వీరిప్రక్కనే నివసించు 'లీథుయేనియను' లును నింకను దమభాషాభక్తిచే వానిని విడువఁజాలక, గృహములందు మాత్రము తమ

భాషలనే మాటలాడుచున్నారు. బలాత్కారముగాఁ బోలాండువారి జాతీయము నిర్మూలముచేయుటకు ముగ్గురు బలియులగు రాజులు కంకణము కట్టుకొనిరి. అప్పటికిని నల్పులయ్యు, బలహీనులయ్యు జాతీయాభిమానముచేఁ గట్టుపడి పాలకుల కెంతయో తొందర కలుగఁజేసిరి. అక్కారణంబుననే వారిస్థితి మఱింత హీనదశకువచ్చె. యూరపు ఖండమందు మఱియొక విశేషము కూడఁ జూడవచ్చు. జాతీయవిభేదము తఱచుగ భాషలంబట్టియే యేర్పడినను, అది జాతీయ నిర్ధారణ యందొక ముఖ్యకారణమై యుండలేదు. మిక్కిలి చిన్నదై స్పష్టమైన మూడుభాషలను గలిగిన స్విట్జర్లాండునందేకాక మఱి కొన్నిరాజ్యములందుఁ గూడ జాతీయమునకు భాష ముఖ్యకారణమై యుండలేదు. ఇటుల భాషాభక్తిఁగల జనులచే మాటలాడఁబడు భాషలు సాధారణముగ నిర్మూలింపఁబడఁ జాలవనుటకు నెన్నియోయుదాహరణంబులఁ జూపింపవచ్చు. భాషయే బలముకలదియైన యెడల, దానిని మాటలాడువారిని జయించినవారియొక్క భాషను, నిది జయించుటకూడఁ దటస్థించుచున్నది. దీనికి నుదాహరణము గ్రీసుయొక్క సుప్రసిద్ధ రోమకాక్రమణమే. రోమనులు గ్రీకులను జయించినను భాషను మాత్రము జయింపఁ జాలిన వారుకారు. అందుకు విరుద్ధముగ గ్రీకుభాషయే రోమకభాషలపైఁ బైచేయియయి వారి వాఙ్మయమునకు మాతృకయయ్యె. బలపౌరుషములు గలిగి జయశీలురైన రోమనులభాష గ్రీకుభాష నెందువలన నశింపఁ జేయఁ జాలక పోయె? గ్రీకుభాష యాధిక్యముచేతనేకదా. లాటినుభాష యాంగ్లేయదేశమునకును, తదితరదేశములకును గొంపోఁబడియె ; ఆంగ్లేయదేశమునందు వారిపాలనయుండువఱకు నిలిచె ; వారిపాలనాంతముతో నదియు నంతమొందె. ఏలవ్యాపించె నేల యంతమొందె? పాలకభాషయై, ఇప్పటి యాంగ్లేయభాషకంటె నప్పుడది యౌన్నత్యపదవియందుండు కతంబునవ్యాపించె. ఎంతయున్నతభాషయైనను, ఎంత యప్పటి నవనాగరికులచే నది యవలంబింపఁ

బడినను, జానపదులకయిష్టమయినందున, వారు దేశము విడిచినపు డదియు నశించె. బలాత్కారముగాఁ గొనిరాఁబడిన భాషలు బల ముడుఁగగనే నిలుచుట కష్టముకదా! లాటినుభాష ముఖ్యముగఁ బురోహితులచే నుపయోగింపఁబడుచుండ, నాంగ్లేయభాష తలయెత్తకమున్న, నార్మను ఫ్రెంచి భాష యనునది యొకటి, ఇంగ్లాడు నార్మనుఫ్రెంచిరాజువశమైన కారణమున, నింగ్లాండునకుఁ గొని రాఁబడియె. ఈభాష పూర్వపు ఆంగ్లోసాక్సను భాషాకవిత కడ్డువచ్చినను, మనయాంధ్రమునకు సంస్కృతముచేసినట్టి మహోపకారమును జేసె. లెక్కలేని క్రొత్తపదములఁ గుప్పలుకుప్పలుగ భాషలోనికిఁ గొనివచ్చె. భాషకుఁ గ్రొత్తవన్నెఁ దెచ్చె. దేశభాషను మార్పఁగల్గెనే కాని నందలిశబ్దంబులు మండలాధిపతులచే మన్నింపఁబడినను, ధనికులచే నుద్యోగస్థులచే మాటలాడఁబడి గౌరవముగఁ జూడఁబడినను, నందు నిలువఁగల్గెనే? లేదనుట విదితము. ఇట్టి బలిష్ఠమైన భాషయే దేశభాషను నిర్మూలింపలేక పోయె. ఇట్టి కాలమున నింగ్లాండునందు, ఫ్రెంచిభాషనుండి కొన్ని భాషాంతరీకరణములును, కొన్ని ఫ్రెంచిభాషలో వ్యర్థపు కవిత్వములును వెలువడినవి. మొత్తము మీఁద దేశభాషాపరిశ్రమమునకుఁ గొఱఁతయయ్యె. నూరులవర్షములవరకు మాతృభాషను నభివృద్ధిఁ జేయుటకు బదులుగ నాంగ్లేయులు తమకాలమును వ్యర్థపుచ్చిరి. స్వదేశభాష అంతకాలము పాడాయె. పరభాషను గొనఁజాలక పోయిరి. మొత్తముమీఁద నాంగ్లేయభాషకు నీమిశ్రమమువలన మహోపకారమైనదని పెక్కు విద్వాంసులు తలంచినను, ఆంగ్లోసాక్సనుభాష దీని సహాయమును గొననిచో నెటు లభివృద్ధి చెందియుండునో, ఎట్టి యున్నతస్థితికి వచ్చి యుండునో ఎవ్వరు నుడువఁగలరు?

ఎందరో యాంగ్లేయులు ఫ్రెంచిజర్మను మొదలగు భాషల నేర్చిరి; ఆయా భాషలలో వ్రాసిరి. ఫ్రెంచిజర్మనీవారితో సరితూఁగఁ గలిగిరా? ఆయాభాషలలోనుండు సామాన్యకవిత్వముంబోలిన కవిత్వమైనఁ జెప్పఁగలిగిరా? అటులే

పరదేశీయు లెందరో ఆంగ్లేయభాషాభ్యాసము చేసిరే, ఒక్కరైన నాంగ్లేయ కవులంబోలఁ గలిగిరా? దాదాపు నూరుసంవత్సరములనుండి, యాంగ్లేయ భాష మనకుఁ గఱపఁబడుచున్నది కదా, ఏఁడీ, ఒకసామాన్యపు కవియైన నిందుఁబుట్టెఁగల్గెనే? హిందూస్థానమందలి దేశభాషలయందంత శ్రద్ధఁ జూపఁ బడక పోయినను, ఒకొ్కకభాషయందు నెందరు సుప్రసిద్ధకవులు పుట్టుచుఁ బెరుఁగుచున్నారో చూడుఁడు. పైవిషయములం జక్కఁగ నాలోచించినచో "No great poet is inspired but in his native language" అనఁగా 'మాతృభాషయందుఁ దప్ప గొప్పకవీశ్వరునకుఁ గవితాధార కుదురఁ జాలదనుట' నిశ్చయముగాఁ గనఁ బడుచున్నది. భాషకు జన్మభూమియె యుత్తమమైనదిగఁ గాన్పించుచున్నది. ఏలన, నెందరో యాంగ్లేయులు పరదేశంబుల నివాసమేర్పఱచుకొని, వందలయేండ్లుగ నివసించుచున్నను, లాంగ్ ఫెల్లొ మొదలగు సామాన్యకవులు అమెరికాయందు మాత్ర ముద్భవిల్లిరి కాని, తదితర భాగము లింకను గొప్పకవీశ్వరులకు స్థానంబులైనటులఁ గనఁబడదు. ఆభగవన్మాయా విశేషమేమో మనకుఁ దెలియదు. షేక్స్పియరు మిల్టను బోలిన కవులు, ఆస్ట్రేలియాలోను, కనడాలోను, దక్షిణాఫ్రికాలోను నిఁకఁ బుట్టుదురేమో! ఈపైదేశంబులలోఁ బెక్కిటికంటె హిందూదేశమే కొంత వఱకు నదృష్టవంతురాలుగఁ గనఁబడును. ఏలయన, నిందలివారు, పైదేశముల వారి సమానముగ నింగిలీషువ్రాయువారే కాక, కొంతవఱకుఁ బరభాషయైనను, కవిత్వ ధోరణికూడఁ గలిగి, కొన్నిగ్రంథముల రచించిరి. వచనము వ్రాయుట యందును, నుపన్యాసంబుల నిచ్చుటయందును మాతృభాషగల యాంగ్లేయు లనే వీరు మించిరన హైందవుల జ్ఞానాధిక్యము విశదమగును. భాషలను నేర్చి కొనుటలో నాసియాఖండవాసులకు సాధారణముగను, నందులో హైందవు లకు నధికముగను, నందులో హిందువులకు మఱింత యధికముగను సామర్థ్య మున్నటుల స్పష్టమగుచున్నది. ఎంతసామర్థ్యమున్నను, తాము తమభాష

యందుఁ జూపఁగల శక్తిసామర్థ్యములఁ బరభాషయందుఁ జూపఁజాలరు. ఇదియుఁ గాక, యాంగ్లేయభాష పలుదేశంబుల విస్తరిల్లుచున్నను, వేల్సునందును, స్కాట్లాండునందలి హైలాండ్సులోను, ఐర్లాండునందును బూర్ణముగ వ్యాపింపఁజాలకున్నది. ఇంట గెలిచి రచ్చగెలుచుటకు బదులుగ నీభాష రచ్చ గెలిచి యింట గెలువలేకున్నది. ఆంగ్లేయభాషతో నత్యంత భేదము లేకున్నను,వారేల వారిభాషను మాటలాడుటయందే గర్వోన్నతులగుచున్నారు. అన్నివిధముల శ్రేష్ఠమై రాజకీయమైన భాషను నేల యభ్యసింపకున్నారు? వారిభాష శాఖయైనను, నాశాఖమీఁదఁగూడ వారికి నత్యంత భక్తియుండుట చేతనే దానిని విడువఁజాలకున్నారు. ఇఁక హిందూస్థానమందలి, మాతృభాషను విడిచి, రాజకీయభాషయైన కారణంబున నాంగ్లేయభాషను గుటుంబసహితముగ నభ్యసించి బంధుజనమిత్రంబులకు దూరమగు నవనాగరికుల నేమన వచ్చు?

హిందూస్థానమందుఁ బలుభాషలు కలవనియు, నందుచే నొకజాతీయ పదవికిఁ మనము దగమనియు దుఃఖించుఖిన్నులకు సమాధాన మీయవలెను. హిందుస్థానమునకంటె విస్తీర్ణమునందును జనసంఖ్యయందును గొంచెము పెద్దదగు యూరపుఖండమునం దెన్నిభాషలు కలవో, ముఖ్యమైనభాష లెన్ని కలవో, ఇదివఱకే చూపింపఁబడియున్నది. అచ్చటి భాషాస్థితుల మనదేశమందలి భాషాస్థితులతోఁ బోల్చిచూచినచో మనదేశమే శ్రేష్ఠతరమని మనము చూడఁగలము. అచ్చటి శాఖభాషాభక్తి యిందులేదు; అచ్చటి తీక్ష్ణమైన జాతీయభేద మిందుఁ గానరాదు; అచ్చటి నిర్దయత్వము, అచ్చటి పరస్పర వైరమిందుఁ గాన్పించవు. ఒక స్వల్పవిషయమై యచ్చట నెంతరో రక్తప్రవాహమై యుండెననియు, నిఁకఁగాఁగలదనియుఁ జరిత్ర సూచించుచున్నది. మొదటినుండియుఁ గాలవిభజనఁ జేసి, ఒక్కొకకాలపు హిందూదేశ చరిత్ర యూరపుచరిత్రతో సరిఁబోల్చిచూచినచో, హిందూస్థానమే, పలు

భాషామతంబులుగలిగినను, నెక్కువశాంతము వహించియుండెననియు యైరోపియనులకంటె హైందవులుతక్కువ మత్సరగ్రస్తులనియు విశదమగును.

| | | | |
|---|---|---|---|
| 24,00,000 | జనసంఖ్యగల | గ్రీకు | రాజ్యమును. |
| 33,00,000 | ,, | స్విడ్జర్లాండు | ,, |
| 22,00,000 | ,, | నార్వే | ,, |
| 51,00,000 | ,, | స్వీడను | ,, |
| 54,00,000 | ,, | పోర్చుగల్ | ,, |
| 24,00,000 | ,, | డెన్మార్కు | ,, |
| 51,00,000 | ,, | హాలాండు | ,, |

మఱియు స్వల్పజన సంఖ్యగల 'రొమానియా' మొదలగు నవీనదేశములు సహా తమ భాషలను కాపాడుకొనుచు జగద్విఖ్యాత మగుచుండఁగా

2,20,00,000 జనసంఖ్యగల యాంధ్రులేల తమభాషా జాతీయముల విడనాడవలెను? కొంద ఱాంగ్లేయచారిత్ర కారులనలన విభజింపఁబడినటుల, మనదేశమును భాషానుసరణముగ విభజించినచోఁ బెక్కువిధముల లాభకరముగ నుండు. అటుల విభజించిన యెడలఁ గొన్నిచిన్నవైనను, మొత్తముమీఁద నొకటికిని హానికలుగకుండ దేశము నున్నత స్థితికిఁ దీసికొనిరావచ్చును. అటుల విభజనచేయుట యసాధ్యమని కొందఱు నుడువవచ్చును కాని భాషసేవఁజేయు ప్రతివారికిని నిది మిగుల సులభమని కనఁబడకపోదు. భాషలను మాటలాడు జనసంఖ్యానుసరణముగా విభజించిన (1) హిందీభాగము (2) బంగాళాభాగము (3) ఆంధ్రభాగము (4) మహారాష్ట్రభాగము (5) ద్రావిడభాగము (6) కర్ణాటభాగము (7) గుజరాతిభాగము (8) ఓఢ్రభాగము (9) మలయాళభాగము అనునవి ద్వాదశ భాగం

బులకంటె నెక్కువ కానేరవు. అటులఁ జేసినయెడల మతభేదంబులు భాషాసముద్రంబున మునిఁగిపోవు. ఒక్కొక భాషను మాటలాడువారు తక్కిన వారికంటెఁ దమభాషాభివృద్ధిఁ జేయుటవలన దేశాభివృద్ధికిఁ దోడ్పడినవా రగుదురు !

అటుల విభజించినచో నేలాభములు కలవో మనయాంధ్రదేశమును గూర్చి విచారించెదము. హిందూస్థానమందలి ముఖ్యభాషలు బలమగు కొలఁది భాషాభివృద్ధియై రాష్ట్రభక్తిబీజాంకురము లుద్భవిల్లు. ఆంధ్రరాష్ట్రంబునకు ముఖ్యపట్టణము, ఆంధ్రరాజ్యంబున నెలకొని, పూర్వపు ధన్యాకటము ఓరుగల్లు, విద్యానగరములవలెఁ బ్రసిద్ధికివచ్చు. ఆంధ్రులు వెలుపట గణ్యతకుఁ బాత్రులగుదురు. ఇప్పుడింత యాంధ్రరాష్ట్రంబున నొక్కటైన చక్కని దైనికపత్రిక లేదుకదా. అప్పుడో, ఆంధ్రరాజ్య తిలకంబగు ముఖ్యపట్టణమున నెన్నియో, ఆంధ్రపత్రికలే కాక, యాంగ్లేయ హిందీపత్రికలు కూడ నుద్భవిల్లు. ఆంధ్రకవులకుఁ బ్రజాసహాయమబ్బు. అట్టి పట్టణమున నాంధ్రలక్ష్మి నాట్యమాడవచ్చు. ఆంధ్రరాష్ట్రమును నిట్టిస్థితికిఁదెచ్చుట కాంధ్రున కిష్టమో లేవో చదువరులే తెల్పుదురుగాక.

ఈ వ్యాసమున కేదిమూలాధారమో, ఏది యుత్తరహిందూస్థానమున చిన్ని శాఖలఁ దఱిమివేయుచుఁ తన సార్వభౌమత్వమును స్థాపించుచున్నదో, ఏది నేఁటికాలపు మహాపురుషులచే భవిష్యదేకభాషగాఁ బరిగణింపఁబడుచున్నదో, అట్టి హిందీభాషను గుఱించి యిఁక విచారించెదము. ఈ భాషను మనముఁ ఏకభాషగా భావించి చదివినను మనమెన్నటికిని హిందూస్థానీవారితో నీభాషలో సరితూఁగనేరము. ఏలయన, అందుఁ బెక్కుచిక్కులు గలవు. అక్షరములు సులభమేయైనను భాష యటులఁగాదు. హిందీ ఉర్దుభాషల తారతమ్యము ఇదివఱకే చూపింపఁబడియె. పారసీక యరబ్బీపద భూయిష్ఠమైనందున ఉర్దుభాష యాంధ్రున కత్యంత కష్టము. హిందియన్ననో సంస్కృత

పద భూయిష్ఠమైనందునఁ గొంతవఱకు నాంధ్రునకు సులభము కావచ్చు. హిందీ నేర్చికొనిన యెడల హిందూస్థానీవారికంటె నాంధ్రులే సంస్కృతపదముల నెక్కువ యుపయోగింతురేమో, కాని హిందీ ఉర్దూభాషల (దాదాపు రెండును నొక్కటే గనుక) లో సంస్కృతభాషం బోలిన లింగ భేదమొకటి యెక్కువగఁ గనఁబడుచున్నది. ఇయ్యది సంస్కృతజ్ఞానము లేని యాంధ్రునకు గోచరముకాదు. ఆంధ్రమునందును నాంగ్లేయభాషయందును బ్రాణులలోఁ బుంలింగస్త్రీలింగములని రెండుభేదములును నటుకానివి నపుంసకలింగములనియుఁ బదములు విభజింపఁబడియున్నవి. ఈ భాషయందో పుంలింగస్త్రీలింగములు రెండే కలవు. ఆంగ్లేయభాషయందును, నాంధ్రంబునందును లేని క్రొత్తకష్టమొకటిందుఁ గలదు. దీనిని నేనుదాహరణమిచ్చినఁ గాని విశదీకరింపఁజాలను.

స్త్రీలిం. తబీయత్
పుంలిం. మిజాజ్ } రెండుపదములకును దేహస్థితియను నర్థము.

ఆప్ కితబీయత్ కైసిహై
ఆప్ కామిజాజ్ కైసాహై } మీ దేహస్థితి యెట్లున్నదని యర్థము.

ఈ యుదాహరణములవలన మాటలాడునది పురుషుఁడైనను, స్త్రీయైనను, ఆభేద కతంబునఁ గాక తరువాతి నామవాచకమును బట్టి, పైవాక్యములలో 'మిజాజ్ తబీయత్' పదములు నపుసంకములయ్యుఁ బుంలింగ స్త్రీలింగములుగఁ బరిగణింపఁబడుచు, విభక్తిప్రత్యయమగు యొక్కకు మారుగ రెండు రూపములు 'కి,కా' యుపయోగింపఁ బడుచున్నవి. ఇంతియేకాక, క్రియారూపంబులలోఁ గూడ ('సి,సా' ను చూడుఁడు) మార్పులను గలిగించుచున్నది. ఈ విషయమున ఢిల్లి లక్నోల భాషలకే యించుక భేదము కలదఁట. దక్కను తురకలీవిషయమున నెప్పుడును బొరపడుచుంటయేకాక హిందూస్థానివారిచే హాసింపఁబడుచున్నారు. ఇదియునుఁ గాక క రకు ముందు 'నే' యను నొక

ప్రత్యయము చేర్చుటవలనఁ గ్రియారూపములలోఁ గొన్నిచోట్ల మార్పులఁ జెందుటయుఁ, గొన్నిచోట్లఁ జెందకుండుటయుఁ దటస్థించుచున్నది. హైదరాబాదయందు నిది తఱచుగ నుపయోగింపఁ బడుటయే లేదు. హైదరాబాద వారికంటె నీ 'ఆప్‌నె, మైనె, ఉస్నె' యనునవి మంచినీళ్లప్రాయముగఁ హిందూస్థానివారికిఁ బొర్లివచ్చుచుండును. ఆంధ్రదేశమందలి తురకము తురకమే కాదు కదా, ఇఁక హైదరాబాదయందలి తురకముకూడ స్వచ్ఛమైనది కాదఁట. పైవారిచేత హసింపఁబడునది హైదరాబాదతురకమే. హైదరాబాద వకీలులలో నెవ్వరు చక్కఁగా ననఁగా 'ఫసి' ఉర్దుమాటలాడఁ గలుగుదురో వారే యెక్కువ యౌన్నత్యమునకు వచ్చియున్నారు. అనఁగా ఉర్దుభాష మాతృభాషగాఁ గల తురుష్కులును, మఱికొందఱు హిందువులు మంచిదశయందున్నారు. తెనుఁగువారిలో నొక్కఁడైనను, నీఫసి ఉర్దుమాటలాడుటకుఁ గాని వ్రాయుటకునుగాని శక్తిపరుఁడు కానికారణంబున, వీరే యున్నతస్థితికిని రాఁజాలకున్నారు. నే వ్రాయుసంగతుల నెవ్వరేని సందేహించినచో హైదరాబాదకు వచ్చిపరీక్షించనగు. ఈ ఉర్దుభాషను బరీక్షల కొఱకు నియమించినఁ గాని, లేక యితరవ్యవహారముల నిర్బంధపఱచినఁగాని మనము వెనుకఁ బడకముందు కెటుల రాఁ గలుగుదుము? హైదరాబాదయందాంధ్రు లిపు డెటులున్నవారో, ఉర్దుభాషను లేక హిందీభాషను ముఖ్యభాషగా నొప్పికొనినయెడల, ముందునటులుండువారె. ఈ సంగతి యాలోచించియే కాఁబోలు బంగాలీ లేకభాషాప్రశంస వినియు మిన్నకున్నారు. హైందవజాతీయ సభలలో హిందూస్థానివారు నవ్వఁగ నేయాంధ్రుఁడు పన్యాసంబులఁ దానిచ్చు. దాని నేకభాషగా నొప్పికొని మాటలాడనేరక పోయినఁ గార్యము లెట్లగును? అంతయు హిందూస్థానివారి వశమున విడిచి మనము వారివెనువెంట నడచెదమా? అటుల నొప్పికొనుటకు నాంధ్రులే కాక, ఇతరభాషల మాటలాడు వారెవ్వరును, నందులో ముఖ్యముగ దాక్షిణాత్య

లొప్పికొనరు. ఒక్కొక్క రాష్ట్రసంబంధ కార్యము లాయారాష్ట్రభాషలలో జరుగుచుండిన, నాయాభాషల మాటలాడువారు సర్వ హైందవకార్యంబులకు హిందీభాష నుపయోగించుట కడ్డుపడక పోవచ్చు. అందుచేతనే నేనీ యుద్యమము చేయుటకుఁ గూడ సాధ్యమయ్యెను.

హిందీభాషను సలక్షణముగ మాటలాడుటకును వ్రాయుటకే కష్టమగు నపుడు వారిని బోలిన కవిత్వమెటులఁ జెప్పఁగలుగుదుము; వారితో భాషా విషయంబున నెటులఁ దులఁదూగఁ గలుగుదుము? అటులఁ దులఁదూగ లేక పోయినను నన్యభాష నొక్కదాని నొక తీరున నేర్చి మనయాంధ్రులు కార్య సాధనములఁ జేసికొనఁదగును. మనము హిందీభాషను నేర్చికొనిన యెడలఁ గలుగులాభంబులు వ్యాసాంతమునఁ జూపఁబడియె. ఇపుడు, ఆర్యసామాజిక స్వాములుగాని, సన్యాసిస్వాములుగాని, మనదేశమునకు వచ్చి యుపన్యాసంబులిచ్చినచో నవి గ్రహించుట, హిందూస్థానమందలి యాత్రాస్థలంబులకుఁ బోయిన భాషాకష్టము లేకపోవుట, తురుష్కులతోఁ గలిసిమెలసి యుండుట, హిందూస్థానిబాటసారుల కెవ్వరికేని సహాయంబొసఁగుట, హిందూస్థానమందంతటను వీరైనంతవఱకుఁ బండితపామరజనుల కీభాషఁ దెలియుట వలన నైకమత్యము హెచ్చుటయే యీ హిందుస్థాని లేక హిందీభాషను నేర్చికొనుట వలనిలాభములు. ఎవ్వరైన నీభాషయం దెక్కువప్రావీణ్యము సంపాదింపవలెనన్న నాంగ్లేయభాషవలె నసాధ్యములోనిది కాదు. ఏలన, నాంగ్లేయులమధ్య నాలుగుమాసము లుండవలెనన్న నాలుగువేల రూప్యముల సిద్ధముగ నుంచుకొనవలెను. హిందీభాషకొఱకో యటులఁ గాదు. వరంగల్ ఖాందారై లేర్పడిన తరువాత నాలుగురూప్యములు కర్చుపెట్టిన హిందూస్థానంబున నుండఁగలరు. తమగ్రామములందుఁ బోలె సులభవ్యయములతో నందు వాసముచేయవచ్చును. ఇటు లాలోచించిన నెన్నియోలాభంబులఁ జూపింపవచ్చును. భవిష్యత్తును గూర్చి గోరంతలు కొండంతలుగఁ జేయుట యుక్తము

కాదు కనుక, ఏకభాషానంతర వైభవముయొక్క యూహలఁ జదువరులకు విడిచి నేనక్షర విశేషములకు వచ్చెద.

మహమ్మదీయులచేతఁ దఱచుగను, కొందఱు హిందువులచేతఁ గూడ ఉర్దు భాషకొఱకు వాడఁబడునట్టి పారసీక అక్కరములయొక్కయు, ఉత్తర హిందూస్థానమునందలి హిందువులచేతఁ దమహిందీభాషకొఱకు నుపయోగింపఁ బడునట్టి నాగరీ అక్షరములయొక్కయుఁ బరస్పరభేదము లించుక విచారించె దము. పారసీక అక్షరంబుల యతిశయముల బాగుగ నెఱుఁగవలె నన్న నాంగ్లేయాక్షరంబులతో సరిఁబోల్చిచూడనగు. ఆంగ్లేయభాషయందు మన భాషయందు వలె పదియారచ్చులులేక ముఖ్యముగ నైదచ్చులతోడనే, మన భాషయందలి యచ్చుస్వరముల కంటె నధికస్వరములఁ బల్కించెదరు. ఆంగ్లేయభాషయందలి యచ్చులే యత్యల్పములని పాశ్చాత్యులు కూడ నొప్పు కొనియుండఁగా, నీపారసీక అక్కరములందలి యచ్చులో ఆంగ్లేయభాషను మించియున్నవి. అలీఫ్ (1) ఎ (/) యనునవి రెండచ్చులు మాత్రమె స్వచ్ఛమైన యచ్చులు. వావ్ (') అనునది యుభయాక్షరముగ నుపయో గింపఁబడుచున్నది. ఒక్కొకయుచ్చారణకే భాషయందుఁ బ్రత్యేకమైన యక్షరముపయోగింపఁబడునో, యాయక్షరముల నరుసయే యత్యుత్తమమైనది. అచ్చులు స్వల్పమైన గుణితము కష్టమగుచున్నది. ఆచ్చులును గొన్నిహల్లులును స్వల్పమైన కతంబునఁ బదాక్షరములపొందికలో నేకరీతి లేనందున, బి.యే.లకును నాంగ్లేయవిద్యను ముగించిన ఎం. ఏ. లకుఁ గూడ గుణితములో నప్పుడప్పుడు సందేహము కలుగుచుండును. ఒక పదిపన్నెండుసంవత్సరము లాంగ్లేయభాష యందు గుణితము నేర్చికొనుటయందుఁ గడపిన మెట్రిక్యులేట్ల ఎఫ్ఏల స్థితి నేమనవచ్చు? తప్పులు వ్రాసికొనుట, నిఘంటువులు వెదకుట అవిదిద్దుకొనుట యొక యసాధారణమైనదికాదు. తెనుఁగునందక్షరాభ్యాసముచేసిన యారు నెలల తరువాత, నక్షర పరీక్షఁజేసిన యెడలఁ జుఱుకుగల కుఱ్ఱవాఁడు నరసున్న

యందును శకటరేఫములందును దప్ప నొకతప్పైనను వ్రాయునా? అటులఁ దప్పులు వ్రాయకుండుట పూర్ణాక్షరపఙ్క్తి తెనుఁగునందుండుటం బట్టియే. ఇఁక పారసీకఅక్కరములం దన్ననో పెక్కుచిక్కులు గలవు. ఒకయుచ్చారణకుఁ బెక్కు లక్షరంబు లుండుట, అనఁగాఁ గొన్నియక్షరంబు లనవసరముగ నుండుట, కొన్ని యక్షరములు పల్కకుండుట కొన్నిశబ్దంబులకు నక్షరములు లేక పోవుట యనునట్టి సమానకష్టముల నాంగ్లేయ భాషం దీనిఁబోల్చవచ్చు. ఇదికాక, కొంతవఱకు బాగుగ విద్యనభ్యసించినను నాంధ్రున కగోచరమగు నొక శబ్దము (ధ్వని)లోనె బహునాజూకైన భేదంబులఁ గల్పించి, యీ యక్షరంబులకు నూత్న విశేషమొకటి గల్పించిరి. మఱియు నీ యిరువదవ శతాబ్దమునందు, ఉర్దు యక్షరముల నేర్చికొనుటకును, వానిముద్రించుటకును నేసదుపాయంబులు చేయఁబడినవో చూతము. నేటివరకును జక్కనివ్రాతకు, పాళీకలములు పనికిరావు. పనికిరావనుట కాదు. పాళీలతో వ్రాసినయెడల నక్షరములు కుదురనే కుదురవఁట! 'బరూకల'మనఁబడు రెల్లుకలమును జెక్కికొని కొయ్యపలకమీఁద తెల్లరంగు పూసి, యీకలమును దీనికొఱకుఁ బ్రత్యేకముగాఁ జేయబడిన సిరా బట్టమీద నద్దుకొని వ్రాయవలెను. ఈ నవనాగరిక దినములలో నెంత నాజూకుపని! కానియే మాల్వీనైన నడిగిచూడుఁడు పైకథ మాఱునేమో. ఆలోచనమీఁద మనకుఁగూడ నీయక్షరముల వ్రాతకుఁ బ్రారంభదశయందు నిదియే యుత్తమమైన మార్గమని తోఁపకమానదు. హైదరాబాదు మహమ్మదీయ పట్టణములలో నొక గొప్పపట్టణము. ఇట్టిపట్టణమునం దెన్ని ముద్రాక్షరశాలలుండవలెనో యాలోచింపుఁడు. నిజముగ నెన్నియో ముద్రాక్షరశాలలు కలవు. కాని, ఇచ్చటి సేతలుమాత్రము వింతలు. బండలు, వానిమీఁద చేతితో వ్రాయుట, కొన్నిసంగతులు సరిగఁబడుట, కొన్నిసిరాముద్దలగుట, ఇవిసర్వసాధారణములు. మఱియొక విశేషము వ్రాయ మఱచితిని. ఈ యుర్దుభాషను జుక్కలభాషయనినఁ దప్పుగాదు. ఒకచుక్క హెచ్చినఁ గాని,

తగ్గినఁ గాని విపరీతార్థముకాని, అర్థముకాకుండుట కాని తటస్థించును. కాని, యీనుఖ్తాలు (చుక్కలు) లేనిదికూడ మహమ్మదీయులు, తాము వ్రాసెద మనియుఁ జదివెదమనియు విఱ్ఱవీగుదురు. మాతృభాషగాఁ గలిగిన మహమ్మదీయుల కదిసాధ్యమే కాని, తదితరులకు మాత్ర మదియసాధ్యము కాకపోయి నను జాల కష్టమనిపించును. ఉత్తరహిందూస్థానమున నవీనపద్ధతి ననుసరించి ముద్రాక్షరశాలల స్థాపించి పుస్తకములఁ జక్కనియక్షరములతో ముద్రించు చున్నారు. ఈనవీన ముద్రాక్షరములకును, నిందలి బండ యచ్చక్షరముల కును గొంత భేదముకలిగి దానివలనఁ గూడఁ గొంత కష్టమధికమగుచున్నది. బండయచ్చునందుఁ గొన్నిచోట్ల నీ చుక్కలధికముగఁ బడుటయు, నుండవల సినచోటుల నుండకపోవుటయేకాక, యాంగ్లేయభాషయందువలె విడిగానైన నక్షరములుండక, యెంతవఱకు సాధ్యమో యంతవఱకు నక్షరములఁ గలిపి గుణితమును మఱింత యధిక కష్టముగఁ జేయుచున్నారు.

ఇఁక సంఖ్యలకన్ననో భాషాక్షరములకు వ్యతిరిక్తమైన పద్ధతి నవలంబించె దరు. అక్షరములు మనహిందూస్థానమందలి యక్షరములకును, ఐరోపి యనుల యక్షరములకును విరుద్ధముగఁ గుడివైపునుండి వ్రాయుచు నీ సంఖ్య లకు మాత్రము, కుదురని కారణంబుననో, మున్ను లేక తరువాత వచ్చినకారణం బుననో, మఱేకారణము వలననో, మనసంఖ్యలవలెనే, ఎడమవైపునుండి కుడివైపునకు వ్రాసెదరు. జిలుగు వ్రాతయందు మన తెనుఁగు కష్టమనియను కొనుచుంటిని. దీనిని మించినది మఱియొకటి నాకంటి కిప్పుడు కనఁబడు చున్నది. ఎంతకాలమో కచ్చేరీలలోఁ బనిచేసినఁ గాని, యీజిలుగక్షరములు కనుఁగొనుట కష్టము. ఇన్నివైపరీత్యములు గల్గిన యక్కరంబులు హిందూ స్థానమందలి సర్వజనసమ్మతమగునా? కాని యిందుఁ గొంతసుందరత్వము కాన్పించు. సుందరత్వము కలిగిన కారణమున మనము దీనిని యొప్పికొనియె దమా? ఒప్పుకొనిన నాగరికతవైపు నడచుటకును, నభివృద్ధిఁ జెందుటకును

మాఱుగ ననాగరికాంబుధియందు మునుంగువారమగుదుము. కనుక కొంతవఱకు సుందరములైనను, మహమ్మదీయుల కత్యంత ప్రియములైనను నీయక్షరంబుల వలన నాసియాయందలి పశ్చిమదేశంబులతో సంబంధములు హెచ్చున వైనను, ఏమైనను, నీయక్షరముల నేకలిపి కొఱకు మనము విడిచిపెట్టుదము. ఇంతవఱకు స్వానుభవాభిప్రాయములనే నిచ్చుచుంటి. నాయభిప్రాయంబుల బలపఱచుటకు మహమ్మదీయులలో మహమ్మదీయుఁడనందగినట్టియుఁ బ్రఖ్యాతి వహించినట్టియు డాక్టరు సైయద్ అలిబెల్గ్రాముగారు తమభాషాక్షరముల గుఱించి యిచ్చిన యభిప్రాయము నిందుఁబొందుపఱచెద.

"Like the Pahlavi and Modern Persian, the Urdu is also one of those unfortunate languages which have their alphabet determined by an alien people which is naturally unsuited to the genius of the language and does not express all the sounds in it. The Urdu alphabet is both redundant and deficient. For certain words there are a number of letters whereas other sounds are not expressed at all........................ A most useful peculiarity in the alphabet of the Aryan languages is, that the vowel sounds are always expressed by means of letters, whereas in the Semitic languages the vowel is expressed by arbitrary signs known as 'zer' 'zebar' 'pish' 'Tanveen' etc.......... It is thus evident that the reading of an Aryan language is very much easier than that of a Semitic one.............. Hence in a language like the Arabic, it is not possible to read even a single sentence without knowledge of grammar whereas the merest tyro, after learning the Sanskrit, Greek and Latin alphabets is able easily to read every sentence although he may not understand its meaning.................

It is easily intelligible, how this uncongenial mode of writing has made the acquirement of Urdu so extra-ordinarily difficult and no one can wonder that our children take more than two years simply to read fluently their own mother-tongue. This difficulty in the acquirement of Urdu reading has been and is to this day the chief cause of the backwardness of Mohamaden education "*

"పహ్లావినవీనపార్సీ భాషలకరణి ఉర్దుభాషకూడ పరదేశస్థులచే నిర్ధారణ చేయబడిన వర్ణములుగల దురదృష్టభాషలలో నొకటియైన కతంబున స్వభావసిద్ధముగ భాషకుం దగిన వర్ణములు కాకపోవుటయేకాక భాషలోని యన్నియక్షరంబులకుఁ దగునుచ్చారణంబులు లేకయున్నవి. ఈఉర్దువర్ణ సమామ్నాయము, అక్షరలేని యక్షరంబులు కలదియే కాక, అసంపూర్ణముగ నున్నది. కొన్ని పదములకుఁ బెక్కువర్ణములు గలిగి కొన్నిటికి వర్ణములులేక యున్నవి. ......సెమిటిక్ భాషలలో నచ్చులు జేరి 'జబర్' 'పేష్' 'తన్వీఙ్' మొదలగు నిర్హేతుకమైన గురుతులవలననుచ్చరింపఁబడుచుండఁగా నార్యభాషలలోనచ్చులు ప్రత్యేకాక్షరములవలనఁ బల్కించుట ఒకయుపయోగమైన విశేషముగఁ గనబఁడుచున్నది......కనుకనే సెమిటిక్ భాషను జదువుటకంటె నార్యభాషను జదువుట బహుసులభమని స్పష్టమగును......ఈకారణమువలననే అరబ్బీభాషను బోలిన భాషలలో వ్యాకరణజ్ఞానములేక, ఒకవాక్యమైనను జదువుట కసాధ్యమగుచుండఁగా మిక్కిలి క్రొత్తగా విద్యనారంభించినవాఁడు సహా సంస్కృతలాటినును, గ్రీకు వర్ణసమామ్నాయమును నేర్చిన తరువాత ప్రతి వాక్యమును దానియర్థమును గ్రహించనేరక పోయినను సులభముగఁ జదువ

*Introduction to Saeyed Ali Beligramis Tamaddun-in Arab pp 23-26. Quoted in Hindustan Review, June 1910 by Nishi Kanth Chatophadyaya.

గలఁడు......ఉర్దుభాషాజ్ఞానము సంపాదించుట మిక్కిలి యసాధ్యమగుట, యీస్వభావవిరుద్ధమైన వ్రాతకతంబున యనిసులభముగ గ్రహించనగు. మఱియు మాపిల్లలకుఁ దమమాతృభాషను జక్కఁగాఁ జదువుటకు మాత్రమే రెండు సంవత్సరములకుఁ బైగాఁ బట్టునన నేమివింత? ఉర్దుభాషాభ్యసనముయొక్క కష్టమే నేటివఱకును మహమ్మదీయ విద్యామాంద్యమునకు ముఖ్యకారణము.’’

హిందూమతావలంబకుఁడనైన నామతమే, ఇదికాక బహుభాషాపండితుఁడైన డాక్టరుసైయద్ అలిబెల్గ్రామిగారు నిష్పక్షపాతబుద్ధితో నిచ్చిన యభిప్రాయమును చూచిన తరువాతనైన నాంధ్రదేశమందలి మహమ్మదీయులు తామాంధ్రమును జదివినందుకుఁ బశ్చాత్తాపపడకుందురుకాక. నిష్పక్షపాత బుద్ధికలవారికి భాషామతంబులతో నేమికార్యము? సత్యమే ప్రధానము.

ఉర్దువర్ణముల తరువాత నాంధ్రాక్షరములనేల, ఏకలిపికొఱకు నుపయోగింపఁగూడదని కొందఱడుగుదురేమో. ఆంధ్రమునకుఁ దోడు మఱికొన్ని భాషల యక్కరములుకూడ ననుకూలములైనవియున్నవి కనుక, యన్నిటి నేకముగ విచారించి త్యజించెదము. హిందూస్థానమందలి యక్కరంబులలోఁ గొంతవఱకు బంగాళి గుజరాతీఅక్షరంబులుఁ బ్రాముఖ్యము వహించియున్నవి. అవియుఁగూడ నాయాభాషలమాటలాడు జనసంఖ్య స్వల్పమైనందునను, ముఖ్యయాత్రాస్థానములు వారిదేశములందులేక యాంధ్రులకును దక్కిన దక్షిణ వాస్తవ్యులకును వారిదేశములకు విశేషముగాఁ బోవుట కావశ్యకతలేనందు వలనను వారియక్షరములతో మనకవసరములేదు. ఒకవేళ వాణిజ్యకారణమున వానిని నేర్చికొనవలసివచ్చినను, నాగరీఅక్షరములు వచ్చినతరువాత నాయక్షరములు నేర్చికొనుట యొకకష్టమేకాదు. హిందీయక్షరములు తెలిసియున్న గుజరాతీయక్షరములు రెండుగంటలలో నేర్చికొనవచ్చునన నతిశయోక్తికానేరదు. బంగాళీయక్షరములు కూడ నటులే నేర్చికొనవచ్చునేమో.

ఆంధ్రులకంటెఁ దక్కువజనసంఖ్యగల ద్రావిడులచే నుపయోగింపఁబడెడి యక్షరములను గురించి యించుక విచారించుదము. తెనుఁగు వర్ణములకంటె వ్రాయుటయందు బహుతేలికయైనను, అందునొత్తక్షరములు లేక యక్షరలోపంబు కలిగియున్న కారణంబున నవియుఁ గూడ మనకార్యంబునకుఁ బనికిరావు. మలయాల యక్షరములు, అరవయక్షరములం బోలుటవలనను, కర్ణాటాక్షరములు, ఆంధ్రాక్షరములం బోలుటవలనను వాని గురించి ప్రత్యేకముగా వ్రాయవలసిన పనియుండదు. మిక్కిలి స్వల్పజనులచే వ్రాయఁబడెడి యక్షరముల మనము లెక్కఁగొనుటకు యుక్తమేకాదు. ఇఁక నాంధ్రాక్షరములను గురించి వ్రాసెదము. నాగరీయక్షరముల విశేషములు క్రిందవ్రాయఁబడును. ఆ విశేషము లిందులేనికారణముననే బంగాలిభాష తరువాత యెక్కువజనసంఖ్యచేత వ్రాయఁబడుచున్నను, అక్షరములు మిక్కిలిపొంకముగలిగి సంపూర్ణముగానున్నను, బంగాళీభాషాది యక్షరములతో దీనిని కూడఁ ద్రోసివేయవలసివచ్చినది. ఇంతదనుక హిందూస్థానమందలి వివిధవర్ణంబులను గురించి విచారించితిమి. దేవనాగరీవర్ణములు తప్ప నిందలివర్ణంబులన్నియుఁ దగవని నుడివితిమి. కాని నేఁడు ప్రపంచమునందలి వర్ణములన్నిటిని దినదినక్రమమునఁ గృశింపఁజేయుచు, చిన్నివర్ణమాలలారా! నాముందరనా మీప్రతాపములు, నారాకయెఱింగి గుహలయందో యరణ్యములందో లేక కొండచఱియలయందో దాఁగికొనుఁడు, భగవంతుఁడు మిమ్ముల నిర్మూలింప సమకట్టె మీరేమిచేయఁగలరని వానినిఁ బాఱఁదోలునట్టి రోమకవర్ణములు, అవిమనపాలకులచే నుపయోగింపఁబడునవియేకాక నేఁటికాలమున నవనాగరికులలోఁ బ్రతివానికిని దెలిసిన కతంబునను బ్రపంచవర్తకాది కార్యములకు నెక్కుడు యవసరమైన కారణమునను మనగణ్యతకుఁ బాత్రములు. ఉర్దువర్ణముల నెటుల మనము పరీక్షచేసి వానియోగ్యతాయోగ్యతల, నుపయోగానుపయోగములఁ జూపించితిమో అటులే దీనిగుణవర్ణనఁగూడఁ జేయక తప్పదు. ఇది భాషావిషయిక చర్చ

యనియు రాజకీయములగు నంశంబుల నిందుఁజొన్పఁగూడదనియుఁ గొందఱు మహామహులు తలంచరైరి. ఆంగ్లేయప్రభుత్వ ప్రాబల్యంబు కారణంబుగా నాభాషలో నుపయోగింపఁబడు వర్ణములకే యాధిక్యత యియ్యవలెననియు, వానిని ఏకలిపికొఱకు నుపయోగింపవలెననియు వాదించుచు, వానినిఁ ద్యజించి హిందూస్థానమందు నేకలిపికొఱకు వేరొకవర్ణ సమామ్నాయమును స్థిరపఱుప యత్నించు వారంతగా సరియైన కార్యమును జేయుట లేదనియు సూచించుచున్నారు. ఈ పైయంశములలో సత్యమెంతవఱకుఁ గలదో, ఈ ఏక భాషాలిపి వ్యాప్తికొఱకుఁ గష్టపడు మహాత్ములెంతవఱకుఁ దురభిప్రాయములతోఁ బనిచేయుచున్నవారో కనుఁగొనెదము. నూరు వత్సరములు పైగా నాంగ్లేయభాష మనకుఁ గఱపఁబడుటయు దానివ్యాపకమును, వ్యాపక ఫలితములును గన్నులారఁజూచి, ఇదిమార్గముకాదనియు, వేరొక క్రొత్త మార్గమును వెదుకవలయుననియు లేనిచో హిందూస్థాన మున్నతస్థితికి రాఁ జాలదని తలంచి యిప్పటికి హిందీ భాషయొక్కయు నాగరీవర్ణములయొక్కయు వ్యాపకమునకుఁ బ్రయత్నములు చేయఁబూనిరి. హిందూస్థానము వారు క్రొత్తవిషయముల నవి యేభాగమున నుండినను వానినిఁ గైకొనుదురనుటకుఁ బూర్వకాలపు జ్యోతిశ్శాస్త్రాదులం గ్రీకురోమనుల వద్దనుండి గ్రహించుటవలననే కాక నేఁటికాలమున నవీనపద్ధతి నేదైన నొకక్రొత్తపంట నెవ్వరైనఁ బండించినచో దానికి సమానముగను గొన్నివేళల వానిని మించు నటులఁ గూడ నేవిద్యయురాని జానపదులే వ్యవసాయముచేయుట వలనఁ గూడ, నిదర్శనములు కనఁబడుచున్నవి. నూఱువర్షములకుఁ బైగా రోమక అక్షరములనఁబడు ఆంగ్లేయాక్షరము లిందు నిర్బంధము చేయఁబడినవికదా! వానిలో వీని వర్ణనాతిశయములఁ జూపించునట్టి వారియభిప్రాయంబుల చొప్పున, నతిశయములున్నచో హిందూస్థానమందలి యక్కరము లకాల మరణము నొందుటచే వానిస్థలము నీభాషాక్షరములు సులభముగ గ్రహించు

నవియే. కాని యీ యాధిక్యము లిందు లేవని హైందవులు చిన్ననాఁడే గ్రహించినటుల వానిని గ్రహింపకుండుటవలనఁ గనఁబడును. లింగము లక్ష్మాజీ పంతులుగారు ఆంధ్రపుస్తకములు సహా రోమకాక్షరములలో ముద్రించి యాంధ్రులీయక్షరముఁ గైకొనుదురేమో యని ప్రయత్నించి చూచిరి. క్రైస్తవపాదిరీలు వీరైనంతవఱకుఁ దమపుస్తకముల రోమకయక్షరములలో ముద్రించిరి. ఆనాఁటికాలంబున వీరిచే ముద్రింపఁబడిన నిఘంట్వాది పుస్తకములతో నీదేశస్థులకుఁ గొంతయవసర మున్నకతంబున వానినిఁ గొని చదివిరి. కాని జ్ఞానాభివృద్ధియగు కొలఁది, దేశస్థులీవిదేశాగతవర్ణములు తమభాషలకుఁ దగవని తలంచిరి. ఉత్తరహిందూస్థానంబున మొదట నెన్నియో ఉర్దుగ్రంథములు రోమకాక్షరములలో ముద్రించిరి. తరువాత నిటీవల నలహాబాదు నందుండు బాబురామనారాయణలాలను నతఁడు ఈ రోమకవర్ణనిఘంటువుల కంటెఁ బారసీకవర్ణములతో ముద్రించిన నిఘంటువు లెక్కుడుగ విద్యార్థులు కోరుదురని గ్రహించి ముద్రించి ప్రచురించిరి. అవియంత పూర్ణమైనవి కాక పోయినను, నయిదాఱువత్సరములలో నెన్నియో మాఱు ముద్రితంబగుటవలన నీరోమకాక్షరములకంటె పారసీకాక్షరములనే వీరిష్టపడుచున్నటుల స్పష్టమగును. ఇటులే హిందూస్థానమందలి ప్రతిభాషయందును రోమకాక్షరముల ముద్రితపుస్తకములలో నుపయోగింపఁబడియుఁ దరువాత తమభాషాక్షరములనే పూర్ణముగ నుపయోగింప మొదలిడిరి. నేఁటికాలము రోమకాక్షరముల హిందూస్థానమందలి భాషలకొఱకు నుపయోగింపఁబడుటయే యరుదయ్యె. ఈ యాంగ్లేయాక్షరముల నేకలిపికొఱకు నుపయోగించు యత్నమును వృద్ధిపఱుప యత్నించు మహాపురుషులిదెవఱకు ననఁగా నీ ఏకలిపి పరిషత్తునకుఁ బూర్వమే తమశక్త్యానుసారముగఁ బ్రయత్నించినయుక్తియుక్తముగ నుండియుండు. కాని యందుకు విరుద్ధముగ నీయేకభాషాలిపులకొఱకుఁ బ్రయత్నములు బలముగ హిందువులవలన జరుగునపుడు వీరు తమరోమక

అక్షరముల కొఱకు మొఱపెట్టుటచూడ వీరినడత మొదటినుండి జాతీయ మహాసభకు దూరముగనుండి, దానిఫలితముగఁ గొన్ని స్వాతంత్ర్యము లీయఁబడఁగనే, హిందువులకంటెఁ దమకధికముగ హక్కులుగావలెనను మహమ్మదీయుల నడవడికను బోలుచున్నది. మహమ్మదీయులు కూడ హైందవులే కనుక స్వాతంత్ర్యము లెవరికి దొరకిన నేమని యూరకుండునటుల నీభాషావర్ణవిషయమున నూరకుండుదమా? కూడదు; ఎంతమాత్రమును కూడదు. ఆంగ్లేయులిందున్నవారని నేత్రములు దెరచిచూచు ప్రతివానికిని గాన్పడు. ఆంగ్లేయభాషయను మహావృక్షముయొక్క వేరులు హిందూస్థానంబున నాటుకొని వృక్షమును బెంపొందఁ జేయుచున్నవి. వృక్షముకూడ నానాముఖముల విచ్చలవిడిగఁ బెరుఁగుచున్నది. ఈ మహావృక్షమును నే గాలిగాని, తుపానుగాని కదిలించ గల్గునా? కదిలించలేనపుడు పెకలించు టెటుల, ముక్కలుచేసి వినాశము చేయు టెటుల? ఇట్టి యూహలు కలవాఁడున్మాదవైద్యశాలలో నుంచఁబడుట కర్హుఁడుకాఁడా? కనుక నీ దేవనాగరీయక్షరముల వ్యాపకముకొఱకు శ్రమపడు మహాపురుషుల యభిప్రాయంబులఁ జక్కగ గ్రహించుట ప్రతిహైందవునకును గర్తవ్యము. ఏ కార్యముచేసినను దానివలని లాభములు పెక్కులుండవలెను. చేయునట్టి కార్యముసాధ్యమాయసాధ్యమా యని గమనించవలెను. ఈ పైరెండువిషయములు దీర్ఘముగ నాలోచించి హిందూస్థానమందలి ప్రతిభాషను మాటలాడు వారికిని హిందీభాషయొక్కయు నాగరీవర్ణములయొక్కయు జ్ఞానముండుట యుక్తమని తలఁచి దీనివ్యాపకమునకుఁ గంకణము కట్టుకొనిరి.

ఆంగ్లేయదేశమందుఁ బ్రతిపాఠశాలయందును దమదేశముతో సంబంధము లేని ఫ్రెంచి జర్మను మొదలగుభాషలను గఱపుటకు సదుపాయముల నేర్పఱచి తమదేశమునం దితర భాషావ్యాపకమునకు సహాయమొసంగుట లేదా? జర్మనీ వారు తమకేమాత్రమును సంబంధములేని సంస్కృతవిద్యయందుఁ బండితు

ంగుటకుఁ బ్రయత్నించుటలేదా? అందుకుఁ బాలకులును, తదితరులును సహాయపడుచున్నవారె కాని యాటంకములఁ గల్పించుచున్న వారా? ఇకపరభాషాజ్ఞానము లేని హైందవు లొక్క భాషను నధికముగ నేర్చిన నెటుల నపరాధులగుదురు. రాజకీయ విషయములకు నాంగ్లేయభాష నుపయోగించిన నితర కార్యములకు హిందీభాష నుపయోగించుట కూడదా! హిందీభాష నుపయోగించుటకు మతాదిసంబంధములగు విషయము లెన్నియో లేవా? ఈహిందీభాషను నేర్చుటవలనఁ గల్గులాభములు వేరొకభాగమందుఁ జూపఁబడియె. ఇపుడు బంగాలీ గుజరాతి తెనుఁగు వర్ణములు బహుసులభములు కావచ్చును, నాగరీయక్షరములకంటె నధికసులభము కావచ్చును. కాని నాగరీవర్ణముల నుపయోగించు దాదాపు ఎనిమిదికోటుల జనసంఖ్యగల హిందూస్థాని మహారాష్ట్రిలను, హిందూస్థానమందలి యితరభాషలు మాటలాడువారిని నేదియో యొకయప్రశస్త వర్ణసమామ్నాయమును నేర్చుకొనుమనుటకు బదులు ముఖ్యముగ దాక్షిణాత్యులను బంగాలీ గుజరాతీ వారిని నీనాగరీ వర్ణసమామ్నాయమును నేర్చుకొనుమనిరి. అందువలన వారు శ్రమతక్కువయగునను నొక ముఖ్యవిషయమును నెక్కువ ప్రాముఖ్యముగ నాలోచించిరి. హిందీమహారాష్ట్రేతర భాషల మాటలాడువారె కాక హిందీమహారాష్ట్రి భాషల మాటలాడువారు కూడ రోమక అక్షరముల నేర్చుకొనవలెనన నెంతజాతీయశక్తివృథాయగునో యాలోచింపుఁడు. ఈ యొక్క సంగతి యాలోచించి యందఱు నీ ఏకలిపికొఱకు నీ నాగరీవర్ణముల నొప్పుకొనుచున్నవారు కాని వానిలోనుండు మహిమవలనఁ గాదు. ఈ విషయ ముదాహరణమువలనఁ దెలిసికొందము. తెనుఁగును ముఖ్యభాషగా, నాంధ్రవర్ణముల నేకలిపికొఱకు నొప్పుకొనిన యెడల నాంధ్రభాషను మాటలాడు వారికి మాత్రమే శ్రమయుండదు. అనఁగా ముప్పదికోటులలో దాదాపు ఇరువదెనిమిదికోటులు ఈ భాషను నేర్చుకొనవలసియుండును. హిందీభాషను నాగరీవర్ణములను నేకభాషాలిపుల

కొఱకు నొప్పుకొనిన యెడల ద్రావిడభాషల మాటలాడు దాదాపు 6 కోట్ల జనులకే నేర్చుకొనుట యందుఁ గొంతవఱకు కష్టముకావచ్చును. దాదాపు పదికోట్ల జనులు బహుసులభముగ నేర్చుకొనఁగలరు. దీనివలన హైందీయ జాతీయముయొక్క శక్తి వృధాయధికముగ వ్యయపరచవలసిన యవసరముండదు.

రోమక అక్షరములకు, పాలకులచే నుపయోగింపఁబడుచున్నవను నాధిక్యము తప్ప నేయాధిక్యము కలదో విచారించెదము. చీనాజపాను వారు తమ యక్షరముల విడిచి రోమకాక్షరముల నుపయోగించుకొనుచున్నవారఁట. ఇదిసత్యమే; వారుచేయునది సరియే. తమవర్ణములు పనికిమాలిన వైనపుడు అన్యవర్ణములఁ గైకొనుట తప్పా? నాగరీవర్ణములఁ బోలిన వర్ణములు వారికుండిన వారువానినిఁ ద్యజించి రోమకాక్షరములను గ్రహించిన మనకదిసరియైన యుపమానము కావచ్చును. పులిని జూచి నక్కవాతలు పెట్టుకొనవచ్చునా? తమయక్కరములు పనికిరానపుడు ప్రపంచమంతయు వ్యాపించు రోమకాక్షరముల వారు కైకొనక యేమూలనో దాఁగియుండు వర్ణముల నెటులఁ గైకొనఁ గల్గుదురు? మనదేశమందు యుక్తమైన వర్ణములు లేనిచో మనమును రోమకవర్ణములఁ గైకొనుటకు సిద్ధముగ నుండువారమే. రోమకాక్షరముల కంటె స్వచ్ఛమైన దేవనాగరీవర్ణముల విడిచి మనమేల యసంతృప్తికరమగు రోమకాక్షరములఁ గైకొనవలెను, ప్రపంచమునందలి జనసంఖ్యలో నైదవభాగమగు హిందూస్థానమందలి ముప్పదికోటుల జనులేక భాషను నవలంబించినఁ ప్రపంచమందలి ప్రతిదేశమువారును, నిప్పటి మన భాషలకంటె నెక్కుడుగఖ్యాతతో హిందీభాషా దేవనాగరీవర్ణములఁ జూడరే? వారు వీనిని బట్టుదలతో నేర్చుకొనరే? నేర్చుకొనక పోయిన వారికార్యములు కొనసాగఁగలవా? హిందూస్థానీ వారమైన మనము పరభాషలలోఁ బండితులగుట స్వతస్సిద్ధము. కాని యాంధ్రద్రావిడ కర్ణాటహిందీగుజరాతీ బంగాలీమహారాష్ట్రాదులొకచో గుమిగూడునపుడు మాదనఁబడు భాషలో

మాటలాడు నదృష్టము మనకు వలదా? ఇఁక నీసంగతుల విడిచి వర్ణాతిశయములఁ జూతము.

రోమకవర్ణములు సంఖ్యకు మాత్ర మిరువదియారేయైనను, ముద్రాక్షరములలో రెండుతరగతులును, లిఖితాక్షరములలో రెండు తరగతులును గల్పిన యెడల నూటనాల్గగునని చూడఁ జాలమా? నూటనాల్గక్షరములు నేర్చిన తరువాత నైన గుణితపుఁ గష్టము తగ్గునా? స్వరములు చాలని కారణమున నక్షరముల పైగీత విడియచ్చులను బూర్తిచేయుదమా లేక క్రొత్తవర్ణముల సృష్టించి పైనూటనాల్గింటికి నొకటికి నాల్గు చొప్పునఁగలుపుదమా? ధ్వనినిఁ బట్టి గుణితమేర్పఱచినచోఁ బ్రస్తుత ఆంగ్లేయభాషాగుణితమున కెటుల సహాయకారి యగును? అక్షరవ్యాపకమును బట్టి భాషావ్యాపక మెటులగును? ఏవియో మనమును, మనప్రతిపక్షులు నెఱుఁగ నట్టి లాభములు కొన్నికలవని భ్రమఁజెందినను,ఉర్దుభాషయందుఁబోలె మొదట నుపయోగింపఁగట్టుదిట్టములు చేసిన గుఱుతులు తరువాత విడువఁబడవని యెవ్వరైన దృఢముగఁ జెప్పఁగలరా? గుఱుతుల బాషయందుఁ గష్టము లెవ్వికలవో కనుఁగొనవలెనన నుర్దుభాషాక్షరములం జూడందగు. నాగరీవర్ణములలో లోపములుంగలవని వాదించువారికి నాగరాక్షరముల యందు జ్ఞానములేదనిన మనము పొరపడిన పారముకానేరము. ఉర్దువర్ణములలోను ద్రావిడవర్ణములలోనుండు విశేషాక్షరముల నాగరీవర్ణములలోఁ గల్పినచో నుర్దూభాషను సలక్షణముగా నాగరీవర్ణములలో వ్రాయవచ్చును. తురుష్కులీ రెండువర్ణసమామ్నాయములు చదివిన తరువాత నొకవేళ యాలోచనమీఁద నాగరీవర్ణములఁ గైకొనుదురేమో! కాని వారిని మనప్రక్కఁజేర్చుకొనుటకు మనము విశ్వప్రయత్నములు చేయుదము. హిందీ భాషతో తమకు నేలాటి సంబంధము లేనిదై తమకు నేర్చుకొనుట కత్యంత కష్టమైన యారుకోటుల ద్రావిడులే యీ యేర్పాటున కొప్పుకొనునపుడు ఈ భాషాసంబంధమైన భాషను మాటలాడు మహమ్మదీయులు మనతో నేకీ

భవించి పనిచేయుదురనుట కేమాత్రమును సందేహము లేదు. పారసీకవర్ణముల కంటె నాగరీవర్ణము లెటుల సులభములో మహమ్మదీయులకుఁ జూపించుట మనకుఁగర్తవ్యమైయున్నది. ఈ యొక్క కారణముచేతనే వారిపారసీకవర్ణములలో నుండు విశేషాక్షరముల నాగరీవర్ణములలోఁ జేర్చుకొనవలెను. ఉర్దు పుస్తకములు నాగరీవర్ణములలో ముద్రించుట యావశ్యకము. భవిష్యత్తునందు నేకభాషహిందూస్థానమందంతయు నావశ్యకమనియును, నాగరీవర్ణములఁ గైకొనుటవలన నావైభవము శీఘ్రముగ నబ్బుననియు, నితరవర్ణములఁ గైకొనుటవలన నింతశీఘ్రముగ నదియబ్బదనియుఁ దలంచి యీ దేవనాగరీవర్ణముల నేర్చుకొనుమనిరి. ఇప్పుడైనను రోమకయక్షరములు మనకార్యమునకుఁ బనికి వచ్చునని యెవ్వరైన నుడువఁగలరా? మఱియొకచో నీవర్ణముల నుర్దువర్ణములతో సరిపోల్చి రెండును అసంపూర్ణవర్ణసమామ్నాయములని చూపించితిని. ఇట్టియసంగతవర్ణములఁ గైకొనుటకంటె నేకభాషయు నేకలిపియును లేకుండిననే మనమదృష్టవంతులమని తలంచెద. మనయిష్టానుసారముగా మనము నాగరీవర్ణములఁ గైకొనునపుడు ముద్రణమందుఁ గష్టములను మొదలగునంశములు లెక్కగొనుట సరియే కాదు.

ఇఁకఁబూర్వము దేవతలచే నుపయోగింపఁబడిన కతంబున దేవనాగరీ నాఁబడునట్టియు, నాంధ్రాక్షరంబుల సర్వవిధంబులఁ బోలునట్టియు నాగరీవర్ణములం గూర్చి విచారించెదము. ఆంధ్రాక్షరములందుండు రఱలభేదమిందు లేదు. అర్థానుస్వారభాధయందుఁ గనఁబడదు. అక్షరము గూడ సుందరముగనే యుండును. ఇన్నిటికంటె నివి హిందూస్థానమందలి జనులలో దాదాపు మూడువంతుల వారిచే నుపయోగింపఁబడుచున్నవి. కొంతవఱకు మాఱి దాదాపు మఱి మూడువంతుల జనులచే నుపయోగింపఁబడుచున్నవి. ఈ యొక్క కారణంబుననే యివి మనగణ్యతకుఁ బాత్రమైనవి. నేఁటికాలమున సంస్కృతగ్రంథము లధికముగ నీ యక్షరంబులలో ముద్రితంబగుచున్నవి.

ఆంధ్ర దేశమునందలి సంస్కృతపండితులు తెనుఁగులిపియందుఁ జదివి పండితులైనను, అమూల్యసంస్కృతగ్రంథ మొకటి చదువవలెనన్న నది నాగరీయక్షరంబులలో ముద్రితంబగుటవలన నాయక్షరంబుల నేఁడు నేర్చికొనవలసినవారగుచున్నారు. ద్రావిడవిద్యార్థులు సంస్కృతము ద్వితీయభాషగా నాంధ్రులకంటె నధికముగఁ గైకొనుటవలన నాగరీయక్షర వ్యాపక మందుఁ గూడ నధికమగుచున్నది. సర్వత్ర వ్యాపించుచున్నవై మన గణ్యతాపాత్రములైన యక్షరముల మనమొప్పికొనుట కేమి యసాధ్యముండును? నాగరీయక్షరములు, ఎంత యింపుగ హిందీమరాటీవారికిఁ గాన్పించినను, నాంధ్రునకు మాత్రమటులఁ గాన్పింపవు. ఆంధ్రాక్షరముల సౌందర్యమును పొంకమును, నాగరీయక్షరములయందుఁ గాన్పింపవు. ఈ వ్యాసలేకరి నాగరీయక్షరముల బాగుగ వ్రాయఁగలిగిన హిందూస్థానీవాని చేతను దెనుఁగు కొంతవఱకుఁ జక్కఁగా వ్రాయఁగలిగినవానిచేతను నేకకాలమునందు వ్రాయించి పరీక్షించి చూడఁగా నాంధ్రమందలి వేగము నాగరీవ్రాతయందుఁ గనఁబడలేదు. అందునకుఁ గారణము, కొంచెము అక్షరములఁ జక్కఁగ గమనించినఁ గన్పడు. అవి గీతలు కలిగిన కారణమున జిలుగువ్రాతకు నంతదగినవి కావని తోఁచకపోదు. కనుక నీ రెండు అక్షరపంక్తులలో నాంధ్రమునకు నాధిక్య మియ్యక తప్పదు. ఇట్టియాధిక్యముగల యాంధ్రాక్షరముల విడిచి నాగరాక్షరముల మనము గైకొనఁ గలుగుదుమా? కైకొన లేమనియుఁ గైకొనుట యుక్తముకాదనియు నా యభిప్రాయము. అయినను నాంధ్రులమైన మనము ఏకలిపి వ్యాప్తియందెంతమాత్రము సాహాయ్యము చేయఁగలమో చూతము. సాధారణమైన తెలివి గలవానికి వారమునకంటె నెక్కువగ నీ యక్షరములు నేర్చికొనుట యందవసరము లేని కారణమునను, మనము సంస్కృతము నేర్చికొనవలెనన్న నీ యక్షరములవసరమైన కారణమునను సంస్కృతము ప్రతి హిందువునకును నత్యావశ్యకమైనందునను, దెనుఁగునందుఁ బాండిత్యము సంపాదింపవలె నన్న

సంస్కృతమత్యావశ్యకమైన కారణమునను సంస్కృతగ్రంథము లధికముగ నీ వర్ణములలో ముద్రితంబగుటవలనను నీ యక్షరములను నేర్చికొనుటవలన మనకుఁ బెక్కువిధముల లాభమేకాని నష్టములేదు. ఆంధ్రభాష నభ్యసించిన యాంధ్రునకు నీయక్షరముల నేర్చికొనుట యందేమాత్రమును కష్టములేదు. బాలురకును బాలికలకును గూడ నాంధ్రాక్షరములు బాగుగ వచ్చినతరువాత నాగరాక్షరాభ్యాసము విశేషలాభముతోఁ జేయవచ్చు. గుజరాతిదేశమందటులే జరుగుచున్నదని వినియున్నాఁడను. కనుక ఈ యక్షరంబులందఱికి నేర్పుట మనకర్తవ్యము. ఏలయన, మనవలెనే ద్రావిడ కర్ణాట మళయాళము వారును నాగరాక్షరముల నుపయక్షరములుగను, హిందీభాష నుపభాషగను గఱపినచో హిందూస్థానంబున నే భాగమునకుఁ బోయినను హిందీభాష మూలముగ నన్యోన్యాభిప్రాయముల సులభముగ గ్రహింపవచ్చు. ఆర్యావర్తము పుణ్యభూమి కదా; అందేకదా యార్యౌన్నత్యము పరిపూర్ణదశకు వచ్చినది; గంగాజి జమ్నాజి మొదలగు నదులును కాశీజీ గయాజీ మొదలగు పుణ్యక్షేత్రంబులును నందేకదా నెలకొని యున్నవి; అందేకదా మతోద్ధారణ తఱచుగ నగుచున్నది; అందేకదా యార్య విద్యాతిశయములు తఱచుగ వెల్లడియగుచున్నవి; అందేకదా సర్వఋషి కుటీరనిలయంబై, సర్వనదీ జన్మస్థానంబై నింగినంటుచు భగవన్మాహాత్మ్యమును వెల్లడి చేయు హిమాలయ పర్వతములు ప్రారంభమగుచున్నవి; అందేకదా సస్యఫలభరితంబులగు కేదారోద్యానవనంబులు నెలకొనియున్నవి; అందేకదా యాత్రార్థమై పూర్వాచార పరాయణులగు హిందువులందఱు నేగి తమవిత్తంబుల వ్యయపఱిచెదరు; అట్టి స్థానమేకదా మన గ్రంథములందు నిక్కమగు హిందూస్థానంబనఁ బరఁగు నట్టి ప్రదేశము. ఇట్టియసాధారణ చిహ్నంబులంగల్గిన యీ భూమియందు వ్యాపించియుండు నార్యభాష (హింది)ను నేర్చికొనినఁ బెక్కులు లాభము లుండఁగలవు.

యూరపుమధ్యమునఁ గొంతవఱకుఁ బ్రాముఖ్యము వహించిన కారణంబుననే కదా ఫ్రెంచిభాషను రాష్ట్రీధర్మవిషయిక చర్చలకు నుపయోగించుటకు స్వాతిశయముగల యాంగ్లేయులును నితరదేశస్థులును నొప్పుకొనినవి. ప్రాపంచక పత్రిక సంఘాదిచర్చలకు నింతవఱకును గూడ నాభాషయే కదా యుపయోగించుచున్నారు. ఫ్రెంచివారికి నత్యంతసులభమై, తదితరులకు నేర్చుకొనుట యందుఁ గష్టమగునని కదా దీనిప్రతిపక్షులు నుడువవచ్చు. ఒక వసతికొఱకే కదా అన్యోన్య సంబంధము లేకపోవుటయేకాక పరస్పర వైరమును బూనినట్టి దేశములుకూడ నీయేర్పాటునకు నంగీకరించినవి. ఏకదేశస్థులమై, ఏక ప్రభుత్వమునకు లోఁబడి ఏకజాతీయపదవికి యత్నించు మనమిట్టియేర్పాటున కొప్పికొనినయెడల మనము సుఖులమగుదుమనుట స్పష్టమగును.

ఈ వ్యాసమింతటి ముగియవలెను కాని నాయుద్దేశములలో నొకముఖ్యమైన దానిని వెల్లడిచేయనియెడల నాంధ్రదేశమునకుఁ గృతఘ్నుతఁ జూపినవాఁడనగుదు. భవిష్యత్తునుగూర్చి ఎవ్వరును జెప్పఁజాలరు. హిందీభాషయే యేకభాషగా నగునో లేక ఉర్దుభాష యగునో లేకవీనినుండి మఱియొకటి ఇప్పుడు యూరపు అమెరికాదేశములందు వ్యాపించు ఏస్పరాంటోను బోలిన భాషయుద్భవిల్లునో మనము నేఁడెటులఁ జెప్పఁగలుగుదుము? మిక్కిలి స్వల్పజనసంఖ్యగల స్విజ్జర్లాండు దేశమున నొకభాషకంటె నెక్కుడుభాషల రాజకీయభాషలుగ నెన్నుచున్నటుల, జె. కె. బ్లంట్చ్లియను జర్మను చరిత్రకారుఁడు తన 'సంస్థాన నిర్మాణసిద్ధాంతము'ను గ్రంథములో నిటులవ్రాయుచున్నాఁడు. " But Switzerland has more respect for different nationalities of which it is composed, unites German with French as its official language and on occasion even recognises Italian" ఇఁక హిందూస్థానమంతటి గొప్పరాజ్యములో భాషల కాధిక్యత యియ్యనలసివచ్చుననిన, నది యొకగొప్పవిషయము కాదు.

హిందూస్థానమందలి యార్యభాషలయొక్క సారస్యమును దక్షిణమున ద్రావిడభాషలయొక్క రసమును గైకొని రెంటియందును జేరక కొందఱు పండితులచేఁ బ్రత్యేకముగా నెంచఁబడునట్టియు, హిందూస్థానమందలి జన సంఖ్యయందు మూడవదిగ నెన్నఁబడునట్టిదియు అతివిస్తారమై రసవంతమై హిందూస్థానంబునందెల్ల నాగరికతకు నాటపట్టైన ప్రాచీనభాగమునందు విశేషభాగము వ్యాపించినట్టి మనయాంధ్రమున కేదశ ముందు భగవంతుఁ డిచ్ఛగించియున్నవాఁడో! భగవదిచ్ఛ యెటులున్నను, హిందూస్థాని భాషను నేకభాషగాఁ జేయుటకుఁ బురుష ప్రయత్నమెటుల యావశ్యకమో, అటులే యాంధ్రభాషను గాపాడుటయే కాక దానిని వృద్ధిపఱుచుటకూడ మనకర్తవ్యమై యున్నది. దానికి నవకాశమెంతయో కలదు. మిక్కిలి పురాతనమయి నట్టియు, సంస్కృతమునకుఁ దరువాతప్రత్యేకముగాఁ బూర్ణదశకువచ్చిన ద్రావిడము (అరవము)న కంటె నాంధ్రమే బలముకలదని కొన్నియుదాహర ణంబులవలన మనము గ్రహింపవచ్చును. విద్యానగరరాజ్యకాలంబున నెందరో యాంధ్రులు కన్యాకుమారాగ్రమువఱకు వ్యాపించిరి. అట్టివారిలో నొక్క బ్రాహ్మణుఁడు చెన్నపురిలో నే విద్యార్థిగానుండు నపుడు నేను భోజనము చేయు పూటకూటింటికి వచ్చియుండి నన్నుఁజూచి యేమియో యానందమును బొందినవాఁడై 'అయ్యా మీదేయూరండి' యనియడిగె. బ్రాహ్మణుని యందాం ధ్రత్వమే మాత్రమును గనుఁగొనఁ జాలక ద్రావిడబ్రాహ్మణుఁ డాంధ్రమును మాటలాడుచున్నాఁడని పొరఁబడి, నా దేగ్రామమైన మీకెందుకండీయని జవాబిచ్చితిని. "మేముకూడ నాంధ్రులమేనండి. పూర్వకాలమున నెన్నఁడో మా పెద్దలు దక్షిణమునకుఁ బోయి నివసించిరి; మేమింకను దెనుఁగె మాట లాడుచున్నాము; ఇంకను మీగ్రామమేదో చెప్పుదురా' యని యడిగిరి. మిక్కిలి వృద్ధబ్రాహ్మణుఁడయ్యు దక్షిణదేశవాస్తవ్యుఁడయ్యు నాంధ్రమున నింత భక్తియుండుటకు సంతసించిన వాఁడనై, "అయ్యా మీరు తెనుఁగుదేశమున

నేమియో యెఱుఁగక తెనుఁగునందింతి యభిమానులై యున్నవారె; మీదర్శన మగుటవలన నాకెంతయో యానందము కలిగినది; నేఁబుట్టినది నెల్లూరు సీమను, పెరిగినది హైదరాబాదలో'' నని ప్రత్యుత్తర మిచ్చితి.

తరువాత విచారింపఁగా నాంధ్రులధికముగ ద్రావిడ దేశమునందుండుట యేకాక, నేటివఱకు నాంధ్రమునే, కొంత యేసకలిగినను, స్వచ్ఛమైన రూప మున మాటలాడుచున్నారని తెలిసినది. ఇఁక నాంధ్ర దేశమున వాసముచేయు ద్రావిడవారికిఁ గలుగు మొదటిసంతానము కూడ నరవమును జక్కఁగ మాట లాడఁజాలకున్నారు. రెండుమూడు తరములు దాఁటెనో, ద్రావిడులని పిలుచు కొనుటయు స్త్రీలుకుడిపైటవేయుటయు నింతియేకాని ద్రావిడమన నేమి యో యెఱుఁగరు. ఇట్టివారెందరో యాంధ్రదేశంబునఁ గలరు. నెల్లూరు మండలమందుండు ద్రావిడులుకూడఁ దమదేశమునకు మిక్కిలి దగ్గరనుండియు నరవమును మఱచి యాంధ్రమునఁ బండితులైన వారుకలరు. ఇందుకు విరుద్ధ ముగ వైష్ణవాచారపద్ధతిలోఁ జేరిన వారిలోఁ గొందఱినిఁ గొంతవఱకు నరవము వశముచేసికొనుచున్నది. కానివారి సంఖ్యయత్యల్పమైనందున మనము విచా రింపవలసిన యంశముకాదు. ఇప్పుడు సికిందరాబాదుయందు అరవమును మాటలాడు మొదలియారుకుటుంబములెన్నియో కలవు. వారిందువచ్చి యధిక కాలముకూడఁ గాలేదు. కాని వారు ద్రావిడదేశభాషాభిమానులయి నందున, నరవము తెలియవలెనన్నఁ దమబిడ్డలఁ జెన్నపురికిఁ బంపించుకొనవలసిన వారగు చున్నారు. తగినన్నివిధములఁ దమభాషను గాపాడఁ బ్రయత్నించియు విఫల మనోరథు లగుచున్నారు. అనేక కుటుంబములలో నేఁడు తెనుఁగే మాట లాడుచున్నారు. పైవిషయమును బట్టి నేది గట్టిభాషయో చదువరులే గ్రహింతురు కాక.

అనాగరిక మగ్నమైయున్న మధ్యపరగణాలలోని గోండ్వానా యయిదు భాషల పరీక్షకుఁ దగియున్నది. అందు మరాటిని, తెనుఁగును ఓఢ్రమును

కొంతవఱకు నెట్టి హిందీభాష జయము గొనుచున్నది. నిజాము రాజ్యమును కీకారణ్యమడ్డువచ్చి తెనుఁగును బలహీనముగాఁ జేయనిచో హిందీ యాంధ్రభాషలలో దేనికి జయము కలుగునోకదా? ఈకీకారణ్యమును వరంగల్ చాందా రైలుమార్గమున స్వచ్ఛమైన యాంధ్రము దాటఁగల్గి, అందలియాంధ్రమునకు సాయము చేసినచో, నందు దీనివ్యాపకమునకుఁ గొంతసదుపాయములు కలుగవచ్చు. దక్షిణమున నిప్పుడనేక స్థలముల నాంధ్రాక్షరములు వ్యాపించుచున్నవి. కర్ణాటభాషపైఁ దెనుఁగు పలుచోట్లఁ బైచేయియగుచున్నది. ఈ యవకాశములనందుకొని యాంధ్రమును సాధ్యమగునంతవఱకు వ్యాపింపఁ జేయుట ప్రతియాంధ్రునకును గర్తవ్యమగుచున్నది.

పాశ్చాత్యులును దాక్షిణాత్యులును నాంధ్రముగూర్చి యిచ్చిన యభిప్రాయములందఱికి విదితమేకనుక, ఇటనుడువుట సంక్షేపించి పూర్వమున నాంధ్రులు దక్షిణమునందంతయు నెటులవ్యాపించిరో, అందాంధ్రకవిత యెటులభివృద్ధిం జెందెనో, అటులే యిప్పుడాంధ్రులు పరదేశంబుల వ్యాపించి తమ భాషను వృద్ధిపఱుపఁ బ్రయత్నింపవలెను. ఇక్కాలంబున నాంధ్రమితర రాష్ట్రంబులఁ గూడ వ్యాపించుచున్నందుకు మహారాష్ట్ర గుజరాతి దేశమధ్యంబున నాంధ్రపత్రిక వెలువడుటయే ప్రత్యక్షము గనుక యింతటితో విరమించెద.

---

# దేవనాగరీ వర్ణములు.

## అచ్చులు. स्वर.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| అ | ఆ | ఇ | ఈ | ఉ | ఊ | ఋ | ౠ | ఌ |
| अ | आ | इ | ई | उ | ऊ | ऋ | ॠ | |
| ౡ | ఏ | ఐ | ఓ | ఔ | అం | అః | | |
| | ए | ऐ | ओ | औ | अं | अः | | |

## హల్లులు. व्यञ्जन.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ |
| क | ख | ग | घ | ङ | च | छ | ज | झ |
| ఞ | ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద |
| ञ | ट | ठ | ड | ढ | ण (ण) | त | थ | द |
| ధ | న | ప | ఫ | బ | భ | మ | య | ర |
| ध | न | प | फ | ब | भ | म | य | र |
| ల | వ | శ | ష | స | హ | క్ష | త్ర | జ్ఞ |
| ल | व | श | ष | स | ह | क्ष | त्र | ज्ञ |

## ఆకారాదిగుణము.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ా | ి | ీ | ు | ూ | ృ | ౄ |
| ा | ि | ी | ु | ू | ृ | ॄ |

అక్షరమునకు తరువాతను, ముందును, తరువాతను, క్రిందను, క్రిందను.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ె | ై | ొ | ౌ | ం | ః |
| े | ै | ो | ौ | ं | ः |

పైనను, తరువాతను, పైనను, ప్రక్కను

ఈ పైగురుతుల నుపయోగించినయెడల అకారాదిగుణితము పూర్ణమగు చున్నది. అందుకు నుదాహరణంబుగ 'జ'కారమునకు నీక్రిందఁ జూపింపఁ బడినది. ఇతరవర్ణములకు నిటులేయని గ్రహించునది.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| జ | జా | జి | జీ | జు | జూ | జృ | జౄ | జే |
| ज | जा | जि | जी | जु | जू | जृ | जॄ | जे |
| జై | జో | జౌ | జం | జః | | | | |
| जै | जो | जौ | जं | जः | | | | |

కఠిన సంయుక్తాక్షరము లిందుఁజూపింపఁబడును. ఇందు నీయఁబడని సంయుక్తాక్షరములు గాన్పించినచో నవి యక్షరముల పోలికంబట్టి సులభముగ గ్రహించనగు. విఘ్నేశ్వర్ అని భాష (హిందీ) యందు వ్రాయఁ బడు నపుడు विघ्नेश्वर అని యగును. దీనినిఁ బట్టి 'వి' తరువాత 'ఘ్' గురుతు (వత్తు)ను, తరువాతనే యక్షరమును, దానితరువాత 'శ్' గురుతును తరువాత 'వ' యక్షరమును గనఁబడును. కనుక భాషను జదువుట కిదియ మొదటి శిక్ష.

పదముల చివరనుండు వర్ణములు తఱచుగ పూర్ణమైన హల్లుబద్ధముగ, ననగా స్వరధ్వనిలేక యుచ్చారణ చేయఁబడును. విఘ్నేశ్వర అనివ్రాసి విఘ్నేశ్వర్ అని చదువుదురు. ఇదియ రెండవ ముఖ్యవిషయము,

## సంయుక్తాక్షరములు.

## संयुक्ताक्षर.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| క్క | క్త | క్త్వ | క్న | క్ర | క్ల | క్వ | క్ష్వ |
| क्क | क्त | क्त्व | क्न | क्र | क्ल | क्व | क्ष्व |
| గ్ఘ | గ్ర | గ్వ | ఘ్య | ఘ్న | చ్చ | చ్య | జ్వ |
| ग्घ | ग्र | ग्व | घ्य | घ्न | च्च | च्य | ज्व |
| ట్ట | ట్ర | ణ్ణ | ణ్వ | త్త | త్ర | త్న | త్ప |
| ट्ट | ट्र | ण्ण | ण्व | त्त | त्र | त्न | त्प |
| త్ప్ర | త్ర | ద్గ | ద్ద | ద్భ | ద్ర | న్న | న్య |
| त्प्र | त्र | द्ग | द्द | द्भ | द्र | न्न | न्य |
| శ్చ | శ్న | శ్ర | ష్ట | త్ర్య | స్ర | హ్న | హ్య |
| श्च | श्न | श्र | ष्ट | त्र्य | स्र | ह्न | ह्य |

### అంకెలు. संख्या.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ |
| १ | २ | ३ | ४ | ५ | ६ | ७ | ८ | ९ | १० |

अध्याय ॥४१॥

गिरागद्गदयाऽस्तौषीत् सत्यमालंब्यसात्वतः ।

प्रणम्यमूर्ध्नावहितः कृतांजलिपुटः शनैः ॥

श्रीशुकदेवजी बोलेकि महाराज पानीमें खडे खडे अक्रूरको कितनी एकबेरमें प्रभूका ध्यान करनेसे ज्ञानहुवा, तो, हाथ जोड प्रणाम कर कहनेलगा कि कर्ता हर्ता तुंहि हो भगवन्त भक्तोंके हेतु संसारमें आय धरते हो वेषँ अनन्त, और सुर नर मुनि तुम्हारेही अंशहै. तुंहीसे प्रगट हो तुम्हीमे ऐसे समाते हैं जैसे जल सागरसे निकल सागरमें समाताहै तुम्हारी महिमाहै अनूप. कौन कहसके सदा रहतेहो विराट स्वरूप, शिर स्वर्ग, पृथ्वी पांव, समुद्र पेट, नाभी आकाश, बादल केश, वृक्ष रोम, अग्नि मुख, दशोदिशा कान, नयन चन्द्र, औरभानु, इन्द्र भुजा, बुद्धि ब्रह्मा, अहङ्कार रुद्रा, गर्जन वचन, प्राण पवन, जल वीर्य, पलक लगाना रात दिन, इसरूपसे सदा विराजते हो, तुंहें कौन पहचान सके. इस भाती स्तुति कर अक्रूर जीने प्रभुके चरणोंका ध्यान कर कहा कृपानाथ! मुझे आपके चरणोंमे रक्खो.

नमस्तेवासुदेवाय सर्वभूतक्षयायच ।

हृषिकेशनमस्तुभ्यं प्रपन्नंपाहिमांप्रभो॥

इति श्रीलल्लूलाल् कृते प्रेमसागरे अक्रूरस्तुतिकरणं नाम एक च--त्वारिंशोऽध्यायः॥

౪౧-వ అధ్యాయము.

గిరాగద్గదయాఽస్తౌషీత్ । సత్వమాలమ్బ్యసాత్వతః ।

ప్రణమ్య మూర్ధ్నావహితః । కృతాంజలిపుటః శనైః ॥

శ్రీశుకదేవ్ జి బోలేకి, మహారాజ్ ! పానీమే ఖడె ఖడె అక్రూర్ కొ కిత్ని ఏక్ భేర్ మే ప్రభూకాధ్యాన్ కర్నేసే జ్ఞాన్ హువా, తో, హాథ్ జోడ్

ప్రణామ్‌కర్ కహ్నేలగా కి కర్తా, హర్తా, తుమ్హీ హో భగవన్త్, భక్తోంకే హేతు సంసార్ మే ఆయ్ ధర్ తేహో వేష్ అనంత్, ఔర్ సుర్ నర్ ముని తుమ్హారి అంశ్ హై. తుమ్హీసే ప్రగట్ హో తుమ్హీసే ఐసే సమాతే హై జైసేజల్ సాగర్ సే నికల్ సాగర్ మే సమాతా హై. తుమ్హారి మహిమా హై అనూప్, కౌన్ కహ్ సకే సదా రహ్ తేహో విరాట్ స్వరూప్, సిర్ స్వర్గ్, పృథ్వీపాంవ్, సముద్ర్ పేట్, నాభీ ఆకాశ్, బాదల్ కేశ్, వృక్ష్ రోమ్, అగ్నిముఖ్ దశోందిశాకాన్, నయన్ చంద్ర్ ఔర్ భాను, ఇంద్ర్ భుజా, బుద్ధిబ్రహ్మా, అహంకార్ రుద్ర్, గర్జన్ వచన్, ప్రాణ్ పవన్, జల్ వీర్య్, పలక్ లగానారాత్ దిన్, ఇస్ రూప్ సే సదా విరాజ్ తేహో తుమ్హే కౌన్ పహి చాన్ సకే. ఇస్ భాతిస్తుతికర్ అక్రూర్ జీనే ప్రభూ కే చరణోంకా ధ్యాన్ కర్ కహా కృపానాథ్! ముఝె అప్నే చరణోం మే రక్ ఖో.

నమస్తే వాసుదేవాయ । సర్వభూతక్షయాయచ ।
హృషీకేశనమస్తుభ్యం । ప్రపన్నంపాహిమాంప్రభో ।

ఇతి శ్రీలల్లూలాల్ కృతే ప్రేమ్‌సాగ్‌రే అక్రూరస్తుతి కరణంనామ ఏకచత్వారింశోఽధ్యాయః ।

ఈ పైనీయఁబడిన హిందీభాగమును సులభముగఁ దెలియుటకు గాను ఆంధ్రాక్షరము లలో వ్రాసితిని. పైయధ్యాయము హిందూస్థానమందలి పండితపామరులచేఁ జదువఁబడు ప్రేమసాగరమను పుస్తకమునుండి, తీసి వ్రాసితిని. హిందీవారు తమభాషను జదువుటలో మనమొక విశేషమును గందుము. వ్రాతయందు 'వ' కనఁబడుచున్నను 'బ' యని చదివెదరు. అనఁగా వబలకు భేదముఁ జూపింపరు. అటుల జదువఁబడు 'వ' యక్షరములు, వానిక్రింద వ్రాయఁబడిన గీతలచేఁ జూపింపఁబడియె. పైయధ్యాయము

యొక్క మొదటి పంక్తిలో 'స్త్రాషిత్' అనుదానిని "స్త్రాఖీత్" అని చదివెదరు. ఇట్టి విశేషము లెక్కపగ లేనందువలనను, వ్రాసినటులఁ జదివినఁ దప్పుగ నెన్నఁబడకుండుట వలనను, దీనిని మనము గొప్పగాఁ బాటించవలసినపని లేదు. ఇక పైయధ్యాయములో సంస్కృత శ్లోకముల విడిచి హిందీ భాగమునకు మాత్రమొక రీతిగాఁ దెనుఁగువ్రాసెదను. శ్రీశుకదేవుఁడు (ఇటుల) చెప్పెను:—మహాప్రభో! అక్రూరునకు బహుకొద్ది కాలములో నీటిలోనిలిచినిలిచి ప్రభువుయొక్క ధ్యానము చేయుటవలన జ్ఞానోత్పత్తియై చేతులు జోడించి నమస్కరించి ఇటులఁ జెప్పసాగెను:—భగవంతా! కర్తవును, హర్తవునునీవే. నీభక్తులకొరకు సంసారము లోనికి వచ్చి అనేక వేషములను గైకొనుచున్నావు; మఱియు సురలు నరులు మునులు నీయొక్క యంశలే. నీ వలననే సృష్టింపఁ బడుచున్నారు; ఎటుల సాగరములోనుండి జలము బయలుదేరి సాగరములోఁ జేరుచున్నదో, అటులే నీలో నైక్య మగుచున్నారు; నీమహిమ అనుపమానమైనది. నీ వెల్లపుడు విరాట్స్వరూపముతోనే యుందువని యెవ్వరు చెప్పఁగలరు? శిరము స్వర్గము, భూమిపాదము, సముద్రము ఉదరము, నాభి ఆకాశము, కేశములు మేఘములు, వృక్షములు రోమములు, అగ్నిముఖము, దశదిశలు కర్ణములు, నయనములు చంద్రసూర్యులు, ఇంద్రుఁడు భుజము, బ్రహ్మబుద్ధి, రుద్రుఁడహంకారము, గర్జనము వచనము, పవనము ప్రాణము, జలము వీర్యము, కంటిరెప్పవాటులు దివారాత్రులు, ఈ రూపములతో సదా విరాజిల్లు చుందువు; నిన్ను ఎవ్వరు కనుఁగొనఁగలరు? ఈ భాతిస్తుతి చేసి, అక్రూరుఁడు ప్రభువుయొక్క చరణములను ధ్యానముచేసి కృపానాథా! నన్ను నీ పాదములపై నుంచుకొనుమని చెప్పెను.

